29.10.1993 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 64, సంచిక: 44, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్ రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు

# సమర 'వంకాయలు' ఎంత పని చేశాయండీ!

ఒక్కోసారి "ఊత" పదాలు తెచ్చేతంటా అంతా ఇంతా కాదు. పంచాయితీ రాజ్ మంత్రి సమర సింహా రెడ్డికి వంకాయ అనేది ఊతపదం. ఆయన కోపంతో వున్నా, శాంతంగా వున్నా వంకాయ మాత్రం నోట్లో నానుతూనే వుంటుంది.

ఆ మధ్య ఏదో పైరవీ పట్టుకొని మాజీ మంత్రి కరారి ఈశ్వర కుమార్ పంచాయితీ రాజ్ మంత్రి ఛాంబర్‌కు వెళ్లాడు. అక్కడనే మరో మాజీ మంత్రి గుడివాడ గుర్నాధ రావు, నెల్లూరు ఎమ్మెల్యే జెకె రెడ్డి కూడా వున్నారట. ఆ మాటా ఈ మాటా మాట్లాడు కుంటూ ఈశ్వర కుమార్ జేబులోంచి పైరవీ చీటీ తీసి మంత్రి ముందు పెట్టాడు. ఈశ్వర కుమార్ నియోజక వర్గం లోని ఒక టీచర్ ట్రాన్సఫర్ అది. చీటీ చూడడంతోనే సమర మూతి ముడిచి నో ట్రాన్సఫర్స్ అన్నాడట. అయితే ఈశ్వర కుమార్ గట్టిగా అడగడంతో, మీ జిల్లా డిడిఒకు చెప్తాను, వెళ్లి కలవండి అన్నారట మంత్రి "ఈశ్వర కుమార్ ఏమి అడిగినా చేయండి" అని డిడిఒకు చెప్తానన్నాడట. ఈ సంభాషణ ఇట్లా వుండగానే, ప్రక్కన నిలబడి వున్న ఒక వ్యక్తి, డిడిఒ చేయనందు వల్లనే కదా మీ దగ్గరకు వచ్చింది అని మంత్రితో వాగ్వివాదం పెట్టుకున్నాడట. సమరకు సందేహం వచ్చి, నువ్వెవరివి అని అడిగేసరికి - ఆ ట్రాన్సఫర్ కోరుతున్న టీచర్‌ని తానే నన్నాడు. బదలీ కోరె అయ్యవారు తన ఛాంబర్‌లోకి వచ్చి తనతోనే వాగ్వివాదానికి దిగడం మంత్రికి కోపం వచ్చింది. ఆ అయ్యవార్ని

కొరవ 7 పేజీలో

## ఎంత బిసిలే అయినా ఇంత బ్లాక్ మెయిలా?

# హమ్మయ్యా- ముఖ్యమంత్రి వచ్చేశాడు!

అమ్మయ్యా, ముఖ్యమంత్రి గారు హైదరాబాదుకు వచ్చేశారు. సుమారు పది రోజుల ఢిల్లీ పర్యటన తర్వాత దసరా పండుగ నాడు నగరానికి తిరిగి వచ్చి కాంగ్రెస్ పార్టీ వారిని ఊపిరి పీల్చుకునేలా చేశారు. ముఖ్యమంత్రి హైదరాబాదు వదిలి ఢిల్లీలోనే మకాం వేశారని, దాంతో రాష్ట్రంలో ప్రభుత్వ కార్యకలాపాలు స్తంభించి పోయాయని తెలుగుదేశం వాళ్లు గగ్గోలు పెడ్తున్న విషయం తెలిసిందే. "ముఖ్యమంత్రి ఎక్కడున్నది ఆచూకి తెలిపిన వారికి బహుమానం ఇస్తామని తెలుగుదేశం మాజీ మంత్రి 'గాలి' ముద్దుకృష్ణమ నాయుడు ప్రకటించిన మరుసటి రోజునే, ముఖ్యమంత్రి నగరానికి తిరిగి వచ్చారు. ఇక ఇప్పట్లో తాను ఢిల్లీ వెళ్లేది లేదని ముఖ్యమంత్రి విలేఖరులతో చెప్పారు. "ముఖ్యమంత్రి గారు కనీసం దసరా పండగ్కైనా ఇంటికి వస్తారా" అంటూ ఒక దినపత్రికలో వేసిన కార్టూన్‌ను ముఖ్యమంత్రి ప్రస్తావిస్తూ "ఇదిగో వచ్చేశా" అని చెప్పారు. అయినా నా పిల్లలెవరూ ఇక్కడ లేరు. నేను వచ్చినా రాకపోయినా పెద్ద తేడా ఏముంటుంది? ఢిల్లీ నుంచే టెలిఫోన్,



ఫాక్స్ ద్వారా ఇక్కడి వివరాలు కనుక్కుంటూ తగు ఆదేశాలు జారీ చేస్తున్నాను. పార్టీ పని మీద అక్కడ బిజీగా వుండడం వల్ల ఇప్పటి దాకా రాలేక పోయాను. అంత మాత్రం

కొరవ 10 పేజీలో

# ఎర్ర కోట పై కాషాయ పతాకానికి నిచ్చెన వేస్తున్నాయా అసెంబ్లీ ఎన్నికలు?

ఉత్తరాదిలో జరుగనున్న ఐదు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో వివిధ పార్టీల పట్ల ప్రజాభిప్రాయం ఎట్లా



వుందన్న విషయమై ప్రసిద్ధ ఆంగ్ల వార పత్రిక "ది వీక్" ఒపీనియన్ పోల్ నిర్వహించింది. ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, హిమాచల్ ప్రదేశ్, ఢిల్లీ రాష్ట్రాలలో ఈ అభిప్రాయ సేకరణ చేశారు. మార్కెటింగ్ రీసెర్చ్ ఏజెన్సీ "మోడ్" ఈ ఒపీనియన్ పోల్‌ను పర్యవేక్షించింది. దీనితో పాటు ఎన్నికలు జరగని మద్రాసు, కలకత్తా, బొంబాయి, హైదరాబాదు, బెంగుళూరు నగరాలలో కూడా జనం ఏమను కుంటున్నది తెలుసుకున్నారు.

ఈ ఒపీనియన్ పోల్ ప్రథమ భాగాన్ని మాత్రం వీక్ ఈ వారం ప్రచురించింది. మరొక ఐదు వారాల పాటు - అంటే ఎన్నికలు పూర్తయ్యే వరకు - ప్రతివారం ఒపీనియన్ పోల్ నిర్వహించి, ప్రచురించా లన్నది వారి ఉద్దేశ్యం.

తొలి ప్రజాభిప్రాయంలోనే దేశ రాజకీయాల పట్ల ప్రజల ప్రతిస్పందన ఏమిటన్నది అద్దంలో వలె కన్పడి పోతున్నది. ఢిల్లీ ఎర్ర కోట పైన మువ్వన్నెల కాంగ్రెస్ జెండాను దించి, కాషాయ పతాకాన్ని ఎగర వేసే రోజు ఎంతో దూరంలో లేదన్న వాస్తవం కళ్లకు కట్టినట్లు కన్పడుతూంది. రాష్ట్రాలలో ఏ పార్టీ అధికారంలోకి వస్తుందన్న ప్రశ్నకు 57 శాతం మంది బిజెపికి ఓటు వేశారు. కాంగ్రెస్‌ను కేవలం 32 శాతం మంది అభిమానించారు. కమ్యూనిస్టులు, జనతాదళ్‌ది సిగ్గు చేటు శాతం -4; ఎటూ చెప్పలేని వారూ సరిగ్గా అంతే మంది. విచిత్రమేమిటంటే కాంగ్రెస్ అధికారంలో వుండి, బిజెపి నామ మాత్రంగా కూడా లేని హైదరాబాదు నగరంలో 70 శాతం మంది ప్రజలు బిజెపిదే అధికారం అన్న నిర్ణయానికి రావడం. కాంగ్రెస్‌కు హైదరాబాదులో వచ్చిన స్కోరు కేవలం 26 శాతం. మరీ నోరు వెళ్ల బెట్టాల్సిన నిజం - 35 శాతం మంది ముస్లిం ఓటర్లు బిజెపి గెలుస్తుందని చెప్పడం. అత్యధిక శాతం ప్రజలు వచ్చే లోక్‌సభ ఎన్నికలలో బిజెపి, కాంగ్రెస్‌లు మాత్రమే నిలుస్తాయని, ఇతర పార్టీలన్నీ లెక్కలోకి కూడా రావని అభిప్రాయ పడ్డారు.

రాష్ట్రాల ఎన్నికల విషయంలో బిజెపి ముందడుగు వేసినా - దేశ వ్యాప్తంగా జరిగే లోక్‌సభ ఎన్నికలకు సంబంధించి మాత్రం కాంగ్రెస్ పరిస్థితే మెరుగ్గా వుంది. లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలంటూ జరిగితే మీ మొగ్గు ఎటు అన్న ప్రశ్నకు 38 శాతం మంది కాంగ్రెస్‌ను వరించారు; 35 శాతం మంది బిజెపిని అభిమానించారు. ఎటూ తేల్చి చెప్పలేని వారు నూటికి పదహారుగురైతే, కమ్యూనిస్టులు, జనతాదళ్‌ను కేవలం 11 శాతం మంది ఆదరిస్తామన్నారు.





రాష్ట్రాల అసెంబ్లీలకు ఏ పార్టీ అధికారంలోకి వస్తుందని అడిగితే ప్రజలు స్పష్టంగా బిజెపి వైపు మొగ్గు చూపారు!

తమాషాగా - పెద్దగా ప్రాచుర్యం లేదనుకున్న దక్షిణ భారత దేశంలో బిజెపి అభిమానం సంపాదించు కొంటున్నది. బెంగుళూరులో బిజెపిని 59 శాతం సమర్థిస్తే, కాంగ్రెస్‌కు కేవలం 27 శాతం మంది మద్దతిచ్చారు. హైదరాబాదులో ఇవి - 49 - 35 శాతం; ముస్లింలలో అధిక భాగం - 43 శాతం - కాంగ్రెస్‌ను సమర్థించినా, 18 శాతం మంది బిజెపికి ఓటు వయడం విచిత్రాతి విచిత్రం. జనతాదళ్‌కు వచ్చిన శాతం - 17 - కంటే ఇది ఎక్కువ కావడం గమనార్హం. ఈ ఒపీనియన్ పోల్‌ను బట్టి బిజెపి అన్ని రాష్ట్రాలు, ప్రాంతాలు నగరాలలో అత్యంత వేగంగా తన పలుకుబడిని విస్తరించుకొని పోతున్నదని అర్థం చేసుకోవచ్చు.

అయితే విచిత్రంగా, లోక్ సభకు మధ్యంతర ఎన్నికలు ప్రకటిస్తే ఓటు ఎవరికనే ప్రశ్నకు మాత్రం కాంగ్రెస్‌కు ఆధిక్యత లభించింది.





అయితే ఈ రోజుకీ దేశంలోని అత్యధిక ప్రజానీకం దేశ సమస్యలను పరిష్కరించే సమర్థత కేవలం కాంగ్రెస్ పార్టీకి మాత్రమే వుందని భావిస్తున్నారు. ధరల పెరుగుదలను అరికట్టడంలో కాంగ్రెస్ మెరుగైన పార్టీ అని 30 శాతం మంది భావిస్తే 27 శాతం మంది మాత్రం బిజెపికి ఓటు వేశారు. కేంద్రంలో సుస్థిర ప్రభుత్వ స్థాపన సైతం కాంగ్రెస్‌కే సాధ్యమని 40 శాతం మంది విశ్వసిస్తున్నారు. బిజెపికి ఈ విషయంలో కేవలం 28 శాతం మంది నమ్మకాన్ని చూరగొన గల్గింది. నిరుద్యోగం, మండల్ సమస్యల పరిష్కారంలోనే కాంగ్రెస్ ఆధిక్యత పొందింది. అవినీతి విషయంలో మాత్రం కాంగ్రెస్ పట్ల ప్రజలకు సదభిప్రాయం లేదు. అవినీతిని రూపు మాపడంలో కాంగ్రెస్ చేయగల్గింది ఏమీ లేదని అధిక సంఖ్యాకులు భావించారు. ఒక్క మతతత్వ విషయంలో మాత్రం ప్రజలు బిజెపిని ఆదరించారు.

ఐదు రాష్ట్రాల ఎన్నికలలో బిజెపి గెల్చినా పివి నరసింహా రావు రాజీనామా చేయనవసరం లేదని 55



శాతం మంది భావిస్తున్నారు. అయితే ఈ ఎన్నికల ప్రభావం పివి ప్రభుత్వం పై వుండి తీరుతుందని 63 శాతం మంది నమ్ముతున్నారు. బిజెపి గెల్చినా లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు పెట్టకూడదని 60 శాతం మంది అభిప్రాయ పడటం విశేషం. అట్నే అయోధ్యలో బాబ్రీ మసీదును పునర్నిర్మించ రాదన్నది 55 శాతం మంది అభిప్రాయం. ముస్లింలలో మాత్రం 61 శాతం మంది మసీదు కట్టాల్సిందే నన్నారు.

ఒక్క ఢిల్లీ నగరంలో మాత్రం కాంగ్రెస్ పట్ల మోజు చూపారు ఓటర్లు. 47 శాతం మంది తాము కాంగ్రెస్‌కు ఓటు వేస్తామని చెప్తే, 42 శాతం మంది బిజెపి పట్ల మొగ్గు చూపారు. కమ్యూనిస్టులు, జనతాదళ్‌లకు కేవలం 5 శాతం ఓట్లు పడటం గమనార్హం.

అందరూ వూహించినట్లు ఉత్తరాది ఎన్నికలలో అయోధ్య

కొరవ 8 పేజీలో

బిజెపి రాష్ట్రాలలో గెలిస్తే ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు రాజీనామా చేయనవసరం లేదని ప్రజలు తీర్పు చెప్పారు





కాంగ్రెస్ పై ఎంత కోపం వున్నప్పటికీ దేశ సమస్యలు పరిష్కరించే సమర్థత కాంగ్రెస్‌కు మాత్రమే వుందని ప్రజలు నిర్ద్వంద్వంగా నమ్ముతున్నారు - ఒక్క అవినీతి విషయంలో తప్ప



జమీన్‌రైతు

# ఆటవిక రాజ్యమా?

అనంతపురం జిల్లాలో మంత్రి జె.సి. దివాకర రెడ్డి, ఎమ్పీ డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి వర్గాల మధ్య జరుగుతున్న హింసాకాండ చూస్తుంటె మనం నాగరిక ప్రపంచంలో నివశిస్తున్నామా లేక ఆటవిక రాజ్యంలో బ్రతుకుతున్నామా అన్న సందేహం కలుగుతున్నది. అనంతపురంలో దివాకర రెడ్డి ఇటీవల తిరుగులేని శక్తిగా ఎదిగాడు. తాడిపత్రి ప్రాంతంలో అయితే ఆయన మాటకు ఎదురులేదు. ఎదురు చెప్పిన వారికి సర్వనాశనం మాత్రమే మిగులుతుంది. ఈ పరిస్థితులలో దివాకర రెడ్డితో రాజకీయ విభేదాలు ఏర్పడిన వై.ఎస్. రాజశేఖర రెడ్డి ఆ జిల్లా వ్యవహారాలలో తలదూర్చారు. అప్పటి వరకు అండ లేక అణిగి మణిగి వుండిన దివాకర రెడ్డి ప్రత్యర్థులందరూ ఎదురు తిరగడం ప్రారంభించారు. ఫలితం - రోజూ విధ్వంసాలు. ఇళ్లు తగుల బెట్టుకోవడం, లక్షల విలువ చేసే చీనీ చెట్లు రంపాలు పెట్టి కోసి పారేయడం, బాంబులు విసురు కోవడం, చంపుకోవడం నిత్యకృత్యమై పోయింది. ఇరు పక్షాలలోనూ పలుకుబడి కల్గిన రాజకీయ నాయకు లుండడంతో పోలీసులు నిస్సహాయులై జరుగుతున్న ఘోరాలను మౌనంగా వీక్షిస్తున్నారు.

ఏమిటీ దారుణం? ప్రభుత్వంలో పార్టీలో పదవులున్న వారు ఏ అకృత్యం చేసినా పోలీసులు చర్య తీసుకోరా? రాజకీయ వాదులు ఇంత పచ్చిగా, బహిరంగంగా హింసా కృత్యాలకు పాల్పడుతుంటె ఇక పరిపాలనకు అర్థమేమి వుంటుంది? మొత్తం సంఘటనలను శాంతి భద్రతల సమస్యగా పరిగణించి చర్య తీసు కొంటామని ముఖ్యమంత్రి చేసిన ప్రకటనకు ఆ జిల్లాలో గడ్డిపరక విలువ రాలేదు. రాయలసీమలో ముఠా తగాదాలు మామూలే అని ముఖ్యమంత్రి అంతటి వాడు ఈ దారుణ కృత్యాలను తేల్చి పారేయ జూడడం అన్యాయం. అనంతపురంలో జరుగు తున్నవి గ్రామ ముఠాల అకృత్యాలు కావు; రాజకీయ ముఠాల కార్పణ్యాలు. రెండింటికీ చాలా తేడా వుంది.

ప్రజలకు ప్రభుత్వం పై విశ్వాసం నిలవాలంటె తక్షణం అనంతపురంలో ఈ ఘోరాలు నిల్చి పోవాలి. ఇరు పక్షాల నాయకులను అదుపు చేస్తె తప్ప ఇవి నిలవవు.

# గవర్నర్లు అవసరమా?

ప్రతిపక్షాలు అధికారంలో వుండే రాష్ట్రాలలో కేంద్ర ప్రభుత్వ అనుకూల పార్టీలకు చెందిన నాయకులను గవర్నర్లుగా నియమిస్తె లేని పోని చిక్కులు తప్పవన్న సంగతి మద్రాసులో మరొక సారి రుజువ వుతున్నది. డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గారు అతిగా తన ప్రభుత్వ వ్యవహారాలలో తలదూరుస్తున్నారని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి జయలలిత ఆరోపిస్తున్నది. చివరకు శాసనసభ సమావేశాల విషయంలోనూ గవర్నర్ ప్రభుత్వ సూచనను ధిక్కరించి, ఆలస్యం చేసి, ఆందోళన కల్గించి రాష్ట్రపతి జోక్యం తర్వాత సంతకం పెట్టారు.

చెన్నారెడ్డి గారిది స్వతంత్ర వ్యక్తిత్వం; గవర్నర్ వంటి రబ్బరు స్టాంప్ పదవులకు ఆయన తగను గాక తగరు. వ్యక్తిగా చెన్నారెడ్డి గారు ఎంత మేధావి, సంయమనం కల్గిన నాయకుడైనా కావచ్చు కాని గవర్నర్‌గా ఆయన తన పరిధులలో తాను వుండడం లేదన్నది నిజం. కేవలం కేంద్ర ప్రభుత్వంతో విభేదిస్తున్నారన్న కారణంతో, ముఖ్యమంత్రి జయలలితను ఇబ్బందుల పాల్జేయడం గవర్నర్ హోదాకు కూడా తగని పని. ముఖ్యమంత్రిది రాజకీయ పదవి. కేంద్రంతో సఖ్యతగా వుండాలన్న నిబంధన ఆమె పై లేదు. వుండడం, వుండక పోవడం ఆమె ఇష్టం. కాని గవర్నర్ గిరి రాజ్యాంగ బద్ధ పదవి. రాజ్యాంగ పరిరక్షణ ఆయన కర్తవ్యం తప్ప, రాష్ట్రాలలో వుండే ప్రతిపక్ష ప్రభుత్వాలను ఏడ్పించి కేంద్రానికి అనుకూలంగా మలవాలన్న బాధ్యత గవర్నర్ పై వుండదు. అట్లా ప్రవర్తించడం రాజ్యాంగ విరుద్ధం కూడా! చెన్నారెడ్డి గారూ ముఖ్యమంత్రిగా పనిచేసిన వారే. రెండు పదవుల హక్కులు, బాధ్యతలు, పరిధులు ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. తెలిసీ ముఖ్యమంత్రిని ఆటలాడించడం విచారకరం.

ఇటువంటి పరిస్థితుల వల్లే గవర్నర్ల వ్యవస్థను రద్దు చేయాలన్న నినాదం బలం పుంజుకుంటున్నది. గతించిన రాచరికపు సంస్కృతికి చిహ్నంగా మిగిలిన ఆ పదవిని కొనసాగించడం వల్ల ఇటు ప్రజలకు, అటు రాష్ట్రాలకు ఎటువంటి ప్రయోజనమూ వున్నట్లు కన్పించడం లేదు. రాజ్యాంగ లక్ష్యాలను నెరవేరుస్తూ రాజకీయాతీతంగా ఆ పదవిని నిర్వహించ గల నాయకులూ ఇప్పుడు కరువైనారు. కొన్ని కోట్ల రూపాయల ప్రజా ధనం వ్యర్థం కావడం తప్ప గవర్నర్ల వల్ల ఏ వుపయోగమూ కన్పడడం లేదు. ప్రభుత్వాలు రాజ్యాంగ బద్ధంగా నడుస్తున్నదీ లేనిదీ నియంత్రించడానికి రాష్ట్రపతి వుండనే వున్నారు. గవర్నర్ల వ్యవస్థ మనుగడ అవసర, అనవసరాల పై దేశ వ్యాప్తంగా ఒక చర్చ ప్రారంభించడం తక్షణావసరం.

## జమీన్‌రైతు

29.10.43

6 పేజీలు, 0-1-6

### సుందరయ్యకు సూటి ప్రశ్నలు

#### గుడివాడ సభలో గలభా!

ది. 23.10.1943 తేదిన శనివారం నాడు గుడివాడ గాంధీ చౌకులో సాయంత్రము 6 గంటలకు ఒక బహిరంగ సభ జరిగింది. దానిలో శ్రీ సుందరయ్య గారు ఉపన్యసించుటకు గాను లేచి రష్యా దేశాన్ని, దాని ప్రభుత్వ విధానాన్ని ప్రశంసిస్తూ పది నిమిషాలు మాట్లాడాడు, యింతలో సభలో నుండి ఒకరు లేచి కొన్ని ప్రశ్నలకు సమాధాన మివ్వవలసినదని సుందరయ్య గారిని కోరారు. అతడు పదిహేను ప్రశ్నలను సుందరయ్య గారి చేతికిచ్చారు. వాటి కతడు సమాధానము చెప్ప నిరాకరించాడు. సభ్యులంతా ఉపన్యాసకుని, ప్రశ్నలకు జవాబు యివ్వవలసినది అని కోరారు. అందుకు కూడా అతడు అంగీకరించ లేదు. దాని మీద "నీవు ప్రశ్నలకు జవాబు యివ్వకపోతే వాటిని మాకు యిచ్చెయ్యి" అని సభ్యులంతా కోరారు. దానికి కూడా అతడంగీ కరించక కుండా తగని దురుసు తనంతో, తీవ్రమైన అహంకారంతో, "నేనీ ప్రశ్నలకు జవాబివ్వను ప్రశ్నలను తిరిగి యిచ్చి వెయ్యను" అని చెప్పి వాటి నన్నింటిని జంపి వేశాడు. అంతట ఒక పెద్ద మనిషి ఆయనను యీ విధంగా అడిగాడు. నీవిప్పుడు, ఈ ప్రశ్నలకు జవాబివ్వకపోతే మీ "ప్రజాశక్తి" పత్రికలోనైనా సమాధాన మిస్తారా అని దానికి ఈ చొప్పదంటు ప్రశ్నలకు మేము జవాబిస్తామా అని సుందరయ్య గారు జవాబు యిచ్చాడు. ఈ ప్రశ్నలకు ఉత్తర మివ్వవలసిందని కోరింది బాధ్యత గల పుర ప్రముఖులు బోయిన అయ్యప్ప గారు, గుళ్లపల్లి వెంకట్రామయ్య గారు, కొగంటి రాజ

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

బాపయ్య గారు, లింగం వెంకట రత్నం గారు, లింగం వెంకట శివుడు గారు, మొదలైన వారు - వీరు అనేక విధాల సద్ది చెప్పిన సమాధానాలు యివ్వమని చెప్పినారు. దాని కిన్ని వారు నిరాకరించారు. యింతలో సభలో గోల ప్రారంభమయింది.

- టి.వి.

### గ్రామసీమలు

#### దర్శి వార్తలు

దొడ్డి దారిని వచ్చిన జిల్లా బోర్డు వారు చందలూరు ఆసుపత్రి శాశ్వతంగా ఎత్తేసి పుణ్యం గట్టుకున్నారు. కుంగుబేరుసు తెగ్గొట్టే చీడ పురుగుకు, భూత కోటికి ఆశ్రయ, ఆహారాన్నిచ్చేచి వృక్ష ప్రయోజనంతో పనేమి.

#### కోట - బస్ ప్రయాణం

గత 2 తేది బాలిరెడ్డి పాళెం బస్సులో కోట వద్ద ఎక్కిన 50 మందిలో నెనొకణ్ణి. డబ్బు అడిలో వసూలు జేసినా టిక్కెట్టివ్వలేదు. చెండోడు మిట్టలకు బస్ వచ్చింది. అందర్ని దింపారు. గూడూరు రు. 1-8-0 లు, నెల్లూర్కు 2-0-0 లు యివ్వాలి అన్నారు. ఉన్నవారు ఏడుస్తూ యిచ్చారు, లేని వారు ఏడుస్తూ నిలబడ్డారు. ఈ పద్ధతి అందరికీ లేదు. వెనుక ప్రాయశ్చిత కాండ జరిపిన గండవరం సుబ్బారెడ్డి కుటుంబానికి మాత్రం రు. 0-10-0 ల రేటును. ఏదైనా ఎక్కేటప్పుడే వుండాలి. సగం దారిలో యీ దోపిడి విధానం? మాకు మరే దిక్కు లేదనుకో. బస్ ఓనర్లయినా యీ దుండగం విచారించకుంటె ప్రయాణీకుల గతేమౌండి!

- ఒక విద్యార్థి

#### నాయుడు పేట వార్తలు

ఓ అధికారి! పట్టాలు ఉచితంగా బట్వాడా చేయవలసి వుండగా, రైతుల వద్ద ఒక్క రూపాయ వంతున గుంజు తున్నావటనే, జాగ్రత్త! ఏ చీడ పురుగునైనా రైతు వృక్షం మీదనేనా చెల్లాటం?

ఒక విలేఖరి

కొరవ 10 పేజీలో

# ఇదెక్కడి దరిద్రపు సాంప్రదాయమండీ బాబూ!

దసరా వుత్సవాల సందర్భంగా కళాకారులు తమలో దాగిన నైపుణ్యం ప్రభువుల ముందు ప్రదర్శించి బహుమతులు పొందేవారు. కాని ఆ సాంప్రదాయం ఎంత ప్రమాద కరంగా పరిణమించి దంటె మాముళ్లు ఇవ్వకుంటె, లేదా తగ్గిస్తె కక్షకట్టి సాధించే వరకు వచ్చింది. దరిదాపు అన్ని శాఖల్లో వేలకు వేలు జీతాలు తీసుకొనే పెద్ద వుద్యోగుల మొదలు అటెండర్ల వరకు ప్రజలపై పడి పీక్కొని తింటున్నారు. దసరా, దీపావళి, సంక్రాంతి, మామూళ్లంటూ దిగజారి పోతున్న వుద్యోగులను ప్రభుత్వం నియంత్రించ లేదా?

నెల్లూరు -గునుపాటి వేణుగోపాల్

## సెక్స్ సలహాలు సైంటిఫిగ్గా వుండాలి

ఇటీవల కొన్ని పత్రికలలో దాంపత్య జీవిత సమస్యల పై సలహాలు ప్రచురిస్తున్నారు. అది హర్షణీయమే. కానీ యీ సలహాలు సైంటిఫిగ్గా వుండాలి. ప్రశ్నకు యేదో ఒక జవాబు అన్న ధోరణి హానికరం.

ఉదాహరణకు తరతరాలుగా సమాజంలో నాటుకు పోయిన అపోహల మూలంగా సెక్స్ సమస్యలకు లోనైన వాళ్లకు "కాంపోజ్ (లేక వాలియం)" వంటి మందులను వాడమని సలహా యిస్తున్నారు. సెక్స్ సమస్యల మూలంగా యేర్పడే ఆందోళనకు యీ మందులు తాత్కాలికోపశమనం కాగలవేమో గాని, సెక్స్ సమస్యలకు మూలకారణాలయిన

### జనవాణి

అపోహలను తొలగించలేవు. వాటిని తొలగించడానికి "సెక్స్ థెరపీ" అనబడే ప్రత్యేక మానసిక చికిత్స అవసరం. కాంపోజ్ వంటి మందులు సెక్స్ కోరికను తగ్గించి యీ శిక్షణా విధానానికి అవరోధం కలిగించే అవకాశం వుంది.

సెక్స్ సలహాలను ప్రచురించే పత్రికా సంపాదకులు యీ అంశాన్ని నిశితంగా పరిశీలించ గలరని ఆశిస్తున్నాను.

నెల్లూరు -డా. ఇ. రాజగోపాల రెడ్డి

## హోటళ్లలో దోపిడీ

ఈ మధ్య నెల్లూరు టౌనులోని హోటళ్లు మరీ అధ్వాన్నంగా తయారై వున్నాయి. ట్రంకు రోడ్డులోని ప్రముఖహోటల్‌కు టిఫిన్ చేసేందుకు వెళ్లాను. ఒక నెయ్యిదోశ ఆర్డర్ చెప్పగా, నెయ్యికాదు కదా కనీసం నూనె కూడా సరిగా వేయని దోశ ఇచ్చారు. ఇదేమని అడిగితే నెయ్యి వేసి ఇవ్వను ఎలా కుదురు తుందని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పారు. కాని బిల్ చూస్తె 7 రూపాయలు వేశారు. దోశకు ఇంత ఖరీదు పెట్టినా, ప్రజలు నిలువునా మోసగింప బడుతున్నారు.

కొరవ 10 పేజీలో

# గాంధీ గారికి ఎందరో అనుచరులు- వారసుడు మాత్రం శ్రీరాములు ఒక్కరే!

బాపనపల్లి వెంకట సుబ్బయ్య, ఎం.ఎ.

అమరజీవి పొట్టి శ్రీరాములు తెలుగు వారికి అందించిన స్ఫూర్తికి ప్రథమంగా స్మృత్యంజలి. ఈ సందర్భంగా శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం గారి మాట మనకు చిరస్మరణీయం. "మా శ్రీరాములు గారు దీక్షను ప్రారంభిస్తే లక్ష్యాన్ని సాధించ వలసిందే, లేదా పూర్ణాహుతి కావలసిందే. వెనుక చూపు అనేదే లేదు".

నేను నెల్లూరులో కీ.శే. వాకాటి సంజీవ శెట్టి గారి హాస్టల్ విద్యార్థిగా చదువుకునే రోజులలో మా వార్డెనుగా శ్రీరాములు గారితో పరిచయమైంది. హరిజనోద్ధరణకు కృషి చేస్తున్న వారి శీలం, ధీరోదాత్తత సన్మానించాయి.

శ్రీరాములు గారికి తన శక్తి తనకు తెలుసు కనుకనే ఎన్నడును ముందుకు తోసుకు వచ్చే వారు కారు. ముక్తసరిగ మాట్లాడే వారు. నిర్ణయానికి వచ్చిన తర్వాత దాని పరిపాలనలో వజ్ర సంకల్పాన్ని ప్రదర్శించే వారు. ఆయన అంతటి మహామహుడు కాబట్టే తాను నమ్మిన ఒక లక్ష్యం కోసం ఆత్మ బలి దానానికి ఉద్యమింప గలిగారు. వెనుక చూపు లేకుండా చిరు నగవుతో పూర్ణాహుతి కాగలిగారు. అంతటి మహనీయుడు మనకు లేకుండా పోయారు.

ఆంధ్ర రాష్ట్రం కోసం శ్రీరాములు గారు పూర్ణాహుతి అయిపోయి నారంటే అది ఆంధ్ర జాతి లోని పెక్కు అసంబద్ధతల వలననే. రాష్ట్రం కావాలని చిరకాలంగా కోరాము. దాన్ని సాధించటానికి నిజంగా సత్యాగ్రహంతో పనిలేదు. శాసనోల్లంఘనాలతో నిమిత్తం లేదు. నాయకులందరూ ఒకే మాటపై నిలిస్తే చాలు. ఒక రవ్వంత విజ్ఞతను చూపి, ఏ కొంచెం వ్యవహార దక్షతను ప్రదర్శించినా ఏనాడో మనకు ఆంధ్ర రాష్ట్రం లభ్యమయ్యేది.

కొందరు రాష్ట్రం కావాలంటే కొందరు వద్దన్నారు. కొందరు ఇప్పుడే కావాలంటే కొందరు ఎప్పుడు వచ్చినా తొందర లేదన్నారు. కొందరు కొన్ని షరతులు పెడితే మరి కొందరు మరికొన్ని షరతులు పెట్టారు. మొత్తం పై జరిగింది యావదాంధ్ర అభిమానానికి మారుగా ప్రాంతీయ అభిమానాలకు ప్రాధాన్యత ఇవ్వడం. సమష్టి క్షేమానికి బదులు వ్యక్తిగత అభిప్రాయాలకు విలువ నివ్వడం. మనలో ఇన్ని అసంబద్ధతలు ఇంతగా ఉన్నందు వల్లనే శ్రీశ్రీరాములు గారు పూర్ణాహుతి కావలసి వచ్చింది. ఏటు వైపు చూచినా సంకుచితత్వమే - స్వార్థమే గోచరిస్తున్నవని శ్రీరాములు



గారు కలత చెందారు. సత్యసంధతకు, త్యాగనిరతికి గడ్డిపోచ పాటి విలువ లేకుండా పోయిందని వారు వ్యథ చెందారు. ఆంధ్ర రాష్ట్ర ఉద్యమాన్ని చుట్టు ముట్టి వున్న అనృతాన్ని, కాపట్యాన్ని, దైన్యాన్ని, స్వార్థాన్ని, భీరుత్వాన్ని, భస్మీపటలం చేసి వేయటానికి ఒకరెవరైనా యజ్ఞ సమిధ కావటం అత్యవసరమని నమ్మినందు వలననే శ్రీరాములు గారు ఆత్మాహుతి అయిపోయినారు.

భాషా రాష్ట్రాలు మంచివా? చెడ్డవా? అనే ప్రశ్న మొదటి నుంచీ ఉంది. రెండు వైపులా బలమైన వాదనలు వున్నాయి. రాజకీయ పార్టీలన్నింటికీ చెందిన తెలుగు పెద్దలలో ఎక్కువ మంది భాషా రాష్ట్రం కావాలన్న వారే. అన్ని ప్రాంతాలకు అభివృద్ధి సమఫలం రావాలన్నా ప్రజలకు సన్నిహితంగా వారు ఎరిగిన భాషలోనే పరిపాలన జరగాలన్నా - భాషా ప్రయుక్త రాష్ట్రాలు వుండి తీరాలనే అందరి అభిప్రాయం. ఆర్థిక పరంగానూ, చదువు సంధ్యల్లోనూ ఎక్కువ వెసలుబాటుతో వున్న సర్కారు జిల్లాలతో కలసి వనరులు కొరతగా వున్న రాయలసీమ

కొరవ 10 పేజీలో

> ఆంధ్ర రాష్ట్ర ఉద్యమాన్ని ఆవరించివున్న అనృతాన్ని, కాపట్యాన్ని భీరుత్వాన్ని భస్మీపటలం చేసేందుకు యజ్ఞ సమిధగా మారాడు; ఆత్మ బలిదానంతో అమరుడైనాడు.



విద్యుద్దీప తోరణాలతో ధగధగాయమానంగా వెలుగొందుతున్న స్వాగత ద్వారం; కరెంట్ బల్బుల అంలకరణతోనే భక్తులను మైమరపిస్తున్న రాజేశ్వరమ్మ; తిరునాళ్ల విశేష దృశ్యాలివి!

# హైకోర్టు బెంచ్ న్యాయమైన హక్కు!

## నెల్లూరు సంగతులు

గత 65రోజులుగా రాష్ట్రంలోని వివిధ రాజకీయ పార్టీలు, ప్రజా సంస్థలు హైకోర్టు బెంచ్ కోసం పోరాటాన్ని చేస్తున్నా ప్రభుత్వం స్పందించక పోవడాన్ని వుద్యమ పోరాట కన్వీనర్ న్యాయవాది కర్నాటి రామమోహన రావు విమర్శించారు. ఇటీవల టౌన్‌హాల్లో నెల్లూరు న్యాయవాదుల పోరాట కమిటీ ఏర్పాటు చేసిన బహిరంగ సభలో ప్రసంగించారు. మిగతా రాష్ట్రాలతో పరిస్థితి పోల్చుతూ కోస్తా ఆంధ్రలో హైకోర్టు బెంచి కావాలనడం న్యాయమైన హక్కు, ఈ విషయంలో ముఖ్యమంత్రి డొంకతిరుగుడుగా మాట్లాడడం తగదన్నా రాయన. సంఘంలో మేధావులైన న్యాయ వాదులకు కన్విన్సింగ్ మెంటాలిటీ వుంటుందని, కాని కరడుగట్టిన ముఖ్యమంత్రిని ఇంతమంది న్యాయవాదులు కన్విన్సింగ్ చేయలేక పోయారని తెలుగుదేశం పార్టీ జిల్లా కన్వీనర్ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి అన్నారు. హైకోర్టు బెంచి సమస్య వారం రోజుల్లోగా ముఖ్యమంత్రి పరిష్కరింప గలరనే నమ్మకం తనకుందని ఎమ్మెల్యే జె.కె.రెడ్డి అన్నారు. ఒక వేళ పరిష్కారం కాకపోతే అసెంబ్లీ సమావేశాల్లో అనధికార తీర్మానాన్ని ప్రవేశపెట్టి ప్రభుత్వం పై వత్తిడ తెస్తానని చెప్పారు. జనతాదళ్‌కు చెందిన మాధవరావు, సి.పి.ఐ పార్టీ జిల్లా కార్యదర్శి వేదాచలం సభలో మాట్లాడారు. నెల్లూరు న్యాయవాదులు మద్దాలి మల్లిఖార్జునరావు, జె.సి.ఎన్ అమరనాథ్, రాధామనోహర్, శ్రీరాములతో పాటు రాష్ట్ర బార్ కౌన్సిల్ సభ్యులు టి.రామమూర్తి, విష్ణు, కుమారి ఇంద్రాణి వేదిక నలంకరించారు.

### అధ్యాత్మిక కార్యక్రమాలకు చేయూత నందిస్తా!

అధ్యాత్మిక ప్రభోదనలతోపాటు ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహిస్తున్న చిన్మయా మిషన్‌కు తన చేయూత నందిస్తానని ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి హామీ ఇచ్చారు. 24తేది టౌన్‌హాల్ రీడింగు

కొరవ 8 పేజీలో

# రాజేశ్వరమ్మ తిరునాళ్లు రంగరంగ వైభోగమే!

శ్రీ రాజరాజేశ్వరి దేవి తిరునాళ్లు రంగ రంగ వైభవంగా ముగిసింది. ఈ దేవాలయంలో నవరాత్రి ఉత్సవాలు మొదలు పెట్టి తొమ్మిదేళ్లయిందట. నవవత్సర ఉత్సవాలన్నమాట. అందువల్ల అధ్యక్షుడు కె.వి. రాఘవ రెడ్డి దడబడ లాడించేశాడు. ఆ తొమ్మిది రోజులూ అది జనం కాదు. గ్రాండ్ ట్రంకు రోడ్డు పై వుండడం, జనసాంద్రత కలిగిన ప్రాంతంలో వుండడం, టౌన్ బస్ సౌకర్యం వుండడంతో దేవాలయం కిటకిటలాడి పోయింది. దీనికి తగ్గట్టు విద్యుద్దీపాలంకరణలతో కళ్లు జిగేల్ మన్పించారు. పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం కళాకారులు దేవాలయం ఎదురుగా, రోడ్డు పైన పెద్ద దీపసౌధం నిర్మించారు. దాదాపు నలభై అడుగుల ఎత్తున జైపూర్ హవామహల్‌ను తలపించే రీతిలో కట్టిన ఈ కరెంట్ బల్బుల స్వాగత ద్వారమే తిరునాళ్ల కంతటికీ పెద్ద ఆకర్షణ. రాజరాజేశ్వరి దేవి రాక్షస సంహారం చేస్తున్న తక్షణ ప్రయోజనాలు నెరవేరు తాయన్న నమ్మకం కల్గుతున్నది. గింజలు దంచి, పొడి చేసి, ఫిల్టర్‌లో పోసి డికాక్షన్ చేసుకొని కాఫీ త్రాగేకంటే ఇన్‌స్టంట్ పొడులు కొని అరక్షణంలో కప్పులోకి వేడి వేడి కాఫీ వంచు కోవడానికి ఇష్టత చూపినట్లే, ఇన్‌స్టంట్ వరాలు ఇచ్చే దేవతల పట్ల మోజు పెరుగుతున్నది. రంగనాథుడు, వెంకటేశ్వర స్వామి, నరసింహుడు, శివుడు వంటి వారు ఔట్ డేటెడ్ దేముళ్లయి పోతున్నారు. వారికి సెకండ్ ప్రయారిటీ మాత్రమే లభిస్తున్నది. ఈ మార్పుల వల్ల శక్తి దేవతల ఆలయాలకు ప్రజల విరాళాలు పుష్కలంగా లభిస్తున్నాయి. ఎప్పుడైతే నిధులు సమకూరు తున్నాయో, అప్పుడు అభివృద్ధి కన్పిస్తున్నది. పాత దేవాలయాలకు కనా కష్టం మీద పూజాదికాలకు పైసలు జమ కూడితే గొప్ప అన్పిస్తుండడంతో వాటిలో అభివృద్ధి కన్పించడం లేదు. మెర్క్యురీ దీప కాంతులలో ఇవి మిల మిల మెరుస్తుంటే, గ్రుడ్డి దీపాల వెలుగులో అవి వెల వెల పోతున్నాయి. వెలుగుకు జనం ఆకర్షింప బడడం సహజం కదా!

> జిల్లాలోని అందరు దేముళ్లనూ అధిగమించి పోతున్నదా తల్లి జనాకర్షణలో!

పాత దేవాలయాలకు లక్షలు, కోట్లు విలువ జేసే ఆస్తులున్నాయి; కానీ ఏమి ఫలం? అన్యాక్రాంతాలకు పోను ఆదాయాన్నిచ్చేవి లేనట్లే లెక్క. ప్రభుత్వ చట్టాలు, మితిమీరిన ప్రభుత్వోద్యోగుల పెత్తనం పాత దేముళ్ల పాలిట శాపాలౌ తున్నాయి.

కొరవ 10 పేజీలో

# అడవిలో కాలేజికి ఆడపిల్లలెట్లా వెళ్లాలి?

రాపూరు డిగ్రీ కాలేజి నూతన భవనాలను తీసుకె పోయి అడవిలో కట్టడంతో ఆడ పిల్లలు హడలి చస్తున్నారు. 1984 లో ప్రారంభమైంది కాలేజి. మొదట్లో టౌన్‌లోనే నడుపుకున్నారు. భవన నిర్మాణానికి నిధులు సమకూరడంతో స్థలం సమస్య వచ్చింది. గూడూరు రోడ్డులో ఉచితంగా దొరికేటప్పటికి బిల్డింగు అక్కడ కట్టేశారు. అది టౌన్‌కు 4 కిలో మీటర్ల దూరంలో వుంది. చుట్టూ దట్టమైన అడవి, పక్షుల కిల కిలా రావాలు, జంతువుల ఘీంకారాలు వింటూ, పురాణ కాలం నాటి గురుకులాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ, సహజ సిద్ధ వాతావరణంలో, ప్రకృతి ఒడిలో చదువు కోవచ్చు. అంతా బాగానే వుంది. కాని ఆడ పిల్లలు అక్కడకు రోజూ పోయి రావడమెట్లా అన్నదే సమస్యగా మారింది. బస్సు సౌకర్యం చాలా కొద్ది. ఒక్కో రోజు చీకటి పడిన తర్వాత కాని తిరిగి రావడానికి బస్ దొరకడం లేదు. ఇళ్లలో తల్లిదండ్రుల బీపి పెరిగి పోతుంది. కొందరైతే ఏకంగా చదువే మాన్పించేస్తున్నారు. నడిచి పోయే దూరం కాదు. బస్సు కోసం నిలబడడానికి కాలేజి దగ్గర షెల్టర్ కూడా లేదు. ఎండైనా, వానైనా ఆకాశమే పైకప్పు. వాన వస్తే కాలేజిలో పిట్ట కన్పడడం లేదు. అటెండెన్సు తగ్గిపోతున్నది.

## జిల్లావార్తలు

కాలేజిని అడవిలో కట్టించాలని నిర్ణయం తీసుకున్న పెద్దలే - కాలేజికి వచ్చి పోవడానికి అనుకూలమైన వేళల్లో బస్సు సౌకర్యం, కాలేజి ముందు షెల్టర్, దాని దగ్గర ఒక వాచ్‌మెన్ తదితర ఏర్పాటు చేస్తే తప్ప, రాపూరు అమ్మాయిలు చాకలి పద్దు దగ్గరే చదువుకు ఫుల్‌స్టాప్ పెట్టేయాల్సి వస్తుంది. అయ్యా గ్రామ పెద్దలూ - ఆలోచించండి!

# హరిజనుల సంక్షేమానికి పదికోట్లతో పథకాలు!

జిల్లా షెడ్యూల్డు కులాల అభివృద్ధి సేవాసహకార సంఘాన్ని ప్రగతి పథంలో నడిపించేందుకు దాని ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ శ్రీ బి. కిశోర్ శక్తి వంచన లేకుండా కష్ట పడుతున్నారు. ఎస్.సి. కార్పొరేషన్‌లో పథకాలు రూపకల్పన చేయడం చాలా సులువు; వాటిని అమలు చేయడమంటే మాత్రం తల ప్రాణం తోకకు వస్తుంది. అంటే కోపం వస్తుంది కాని, హరిజన యువకులలో అధిక భాగం బంగారు బాతును చంపే తత్వమే ఎక్కువ; తమ కోసం అమలు చేసే పథకాలను సక్రమంగా వాడుకొని, దీర్ఘకాలిక ప్రయోజనం పొందే ఓర్పు, ఓపిక వారిలో తక్కువ. అందువల్లే ఎస్.సి. కార్పొరేషన్ పథకాలు తరచు విమర్శల పాలౌతుంటాయి. నిరుపయోగంగా మారుతుంటాయి. కార్పొరేషన్ పథకాల లబ్ధి దారులను కూర్చో బెట్టుకుని, వారికి ఓపికగా పరిస్థితి వివరించి, నచ్చ చెప్పి పథకాలను సఫలీకృతం చేయడానికి కిశోర్ పడే యాతన

> పథకాల రూపకల్పన చాలాసులువు; కాని వాటిని సక్రమంగా అమలు చేయడం సాధ్యమా?

అంతింత కాదు. ఆయనలో అంత సహనం ఎక్కడ వుందా అన్పిస్తుంది - ఆ దృశ్యాలు చూస్తే.

బలహీన వర్గాల సంక్షేమ దినోత్సవం సందర్భంగా మొన్న 25 తేది అంబేద్కర్ భవన్‌లో కార్పొరేషన్ పథకాల వివరాలు తెల్పే ఫోటో ప్రదర్శన ఒకటి ఏర్పాటు చేశారు. ఒక సమగ్ర నివేదిక కూడా సమర్పించారు. పథకాలు అమలులో తమ కృషి, బాధలు వివరించారందులో. రికవరీలు ఒకింత కష్టమైనా 93-94 సంవత్సరాలకు కార్పొరేషన్ ద్వారా దరిదాపులు 10కోట్లు ఖర్చుపెట్టి 6,191 మంది లబ్ధిదారులను అభివృద్ధి పరచాలని లక్ష్యంగా పెట్టుకున్నారట. వ్యవసాయరంగానికి పెద్దపీట వేసి 7కోట్ల రూపాయల మేర వుపయోగిస్తున్నారు. దీనిలో ఓపెన్ వెల్స్ పథకానికి 2కోట్ల81లక్షలు వినియోగిస్తున్నారు. తోటల పెంపకానికి

కొరవ 7 పేజీలో



## తాజా దిగుమతి

*మనసులో మాయమైందనుకుంటే-*
*కళ్లో కొచ్చికూచొంది మా ఊరు!*
*కళ్లో కొచ్చిన మా ఊరు*
*కళకళలాడి పోతున్నది!*
*యమబిజీగా ఉన్నారు*
*ఎవరు పట్టినా-*
*టైగర్ రొయ్యలటూ-తాయ్‌వాన్‌కి పంపిస్తున్నారు!*
*బెంగాలీకి కాబోలూ బొప్పిల్ని ఎగుమతి చేస్తున్నారు.*
*కోయంబత్తూరు దాకా*
*కోడిగుడ్లను చేరవేస్తున్నారు!*
*బాల్యాన్ని బస్తీ కాన్వెంట్లకు*
*కుర్రతనాన్ని కువైట్ ''షేక్''లకు*
*తాకట్టు పెట్టేస్తున్నారు!*
*ఇన్ని ఎగుమతుల్లో-*
*ఒకే ఒక్క దిగుమతిలైనా-*
*తమ్ముడూ! అది తమిళనాడు 'వైను'!*

-తిరుమూరు సుధాకర్ రెడ్డి.

## సణుగుడు

* *గెస్ట్‌హౌస్‌లో గొడవ టీకప్పులో తుఫానే!*
* *షామియానాల క్రింద రాజకీయాలు*

గెస్ట్‌హౌస్‌లో ఏదో గడబిడ జరిగిందని మా కీహోల్ డిటెక్టివ్ సంబర పడుతూ చెప్తే - అదెంత రంజుగా వుంటుందోనని ఉబలాట పడ్డాను. కడుపుబ్బరం తగ్గించు కోవడానికి ఫ్లాష్ న్యూస్‌లాగా గతవారం మీకు కొంత విన్పించాను. తీరా విచారిస్తే - లోపల జరిగింది టీ కప్పులో తుఫానే! ఎందుకో సహకార మంత్రి యానాది రెడ్డి గారికి వున్నట్లుండి రాష్ట్ర సహకార బ్యాంక్ పై కోపం తన్నుకొచ్చింది. ఆ సమయంలోనే, మంత్రి కదా. మర్యాదకు పలకరిద్దాం అని జిల్లా బ్యాంకు అధ్యక్షుడు వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గెస్ట్‌హౌస్‌కు వచ్చాడట. మంత్రి గారు తన లోపల ఉడుకుతున్న లావానంతటినీ ఆయన పై క్రుమ్మరించారు. ఆ వేడికి తట్టుకోలేక అసలే కందగడ్డ వంటి రామచంద్రా రెడ్డి గారి ముఖం ఎర్ర టమోటా లాగా పండి పోయిందట.

### డోలేంద్ర

లోపలి కెందు కొచ్చానా అని కలవరపడి, మంత్రి గారు ఎవర్ని తిట్టిపోస్తున్నారో తెలుసుకోలేక మధన పడి, స్వాంతనవచనాలు పల్కించు కోవడానికి తపిమని హైదరాబాదు రైలెక్కేశాడు.

కొరవ 7 పేజీలో

# నెల్లూరు బుల్లెట్స్

విమర్శకుడు

## జనార్ధన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి 1 తేది నెల్లూరు వస్తారు; బహుశా 7 తేది వరకు వుంటారు. వెంకటగిరి, సూళ్లూరుపేట అసెంబ్లి నియోజక వర్గాలలో కార్యక్రమాలు.

## యానాది రెడ్డి

సహకార మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి గారు 26 తేది రాత్రి హైదరాబాదుకు వెళ్లారు; తిరిగి 31 తేది వస్తున్నారు. ఉదయం రావడం, సాయంత్రం పోవడం -అంతే కార్యక్రమం.

## పెంచలయ్య

జిల్లామంత్రి శ్రీ పసల పెంచలయ్య 3 తేది నెల్లూరు వస్తారు.

## మునిసిపల్ సమ్మె - టౌనంతా గబ్బు గబ్బు!

మునిసిపల్ ఉద్యోగుల సమ్మె నిరవధికంగా జరుగుతూనే వుంది. 80 శాతం మంది సమ్మెలో పాల్గొంటున్నారు. శానిటరీ సిబ్బంది అయితే దాదాపు అందరూ పాల్గొంటున్నట్లే లెక్క. నీళ్లకు ఇబ్బంది లేదు; కొళాయిల్లో వస్తూనే వున్నాయి. లైట్లూ వెలుగు తున్నాయి. ఎచ్చిన చిక్కల్లా వీధుల్లో చెత్తదే. టౌన్‌లో ఎక్కడ చూసినా గుట్టలు గుట్టలుగా పేరుకొని పోయి వుంది; కుల్లి దుర్గంధం వెదజల్లుతూంది. టైఫాయిడ్, జాండిస్ రోగాలు మొదలై పోయాయి. దోమలది విచ్చలవిడి. సైడు కాలువలు శుభ్రం చేయక పోవడంతో చెత్త అడ్డం పడి వీధుల్లో మురుగు నీరు పారుతూంది. మరొక వారం రోజులు ఇదిట్లే కొనసాగితే పాత టౌన్ నుంచి జనం పారిపోవలసి వచ్చేట్లుంది. జనం బాధలు చూసి, సిబ్బందికే జాలి కల్గి 27, 28 తేదులలో రెండు రోజులు సమ్మెలో కొనసాగుతూనే వీధులు చిమ్మారు. రెండు వారాలుగా పేరుక పోయిన చెత్త, రెండు రోజులలో శుభ్రం అవుతుందా?

సిబ్బంది సమ్మె మానాలని కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు గారు విజ్ఞప్తి చేశారు. ఇతర మునిసిపాలిటీల వలె గాక నెల్లూరులో సిబ్బందికి ఎప్పటికప్పుడు జీతాలిస్తుందు వల్ల, ఇక్కడ సమ్మె జరపడం అనవసరమని, ప్రజల పన్నుల డబ్బుతో జీతాలు తీసుకొంటూ వారిని ఇబ్బంది పెట్టడం అన్యాయమని కలెక్టర్ గారు అంటున్నారు. ఆయన మాట విన్పించుకునే దెవరు?

నెల్లూరు మునిసిపాలిటీలో దాదాపు 750 మంది సిబ్బంది సమ్మెలో వున్నారు. వారిలో 160 మంది విధులకు హాజరౌతున్నారు.

## డిసిసి విరాళం లక్ష

మహారాష్ట్ర భూకంప బాధితులకు జిల్లా కాంగ్రెస్ కమిటీ తరపున లక్ష రూపాయల విరాళం సేకరించి, ముఖ్యమంత్రికి అందజేశారు. సంజీవ రెడ్డి గారికి అంత మాత్రం ఓపిక, శ్రద్ధ కల్గడం సంతోష పడాల్సిన సంగతే!

## ఎస్‌పి గారి ఫిర్యాదుల దర్బార్

జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ టి. కృష్ణప్రసాద్ గారు ఫిర్యాదుల దినం పేరుతో ప్రజాదర్బార్‌లు నిర్వహిస్తున్నారు. 25 తేది నెల్లూరులో అటువంటి దర్బార్ ఒకటి నిర్వహింప బడింది. 27 మంది వినతి పత్రాలిచ్చారు. ఇందులో ఐదు మాత్రమే నేర సంబంధమైనవి. తక్కిన వంతా ఉద్యోగాలు, ఇళ్ల స్థలాల చిక్కులు వగైరాలట. హోంగార్డు ఉద్యోగాలు ఖాళీగా లేవని, వాటి కోసం ఎవరూ రావద్దని ఎస్‌పి గారు కోరుతున్నారు. వచ్చిన ఫిర్యాదులు, వినతి పత్రాలన్నింటి పైనా సంబంధిత డిఎస్‌పిలు విచారణ జరుపుతారు.

## సుబ్బారావుకు సన్మానం

జర్నలిస్ట్ కురువృద్ధుడు శ్రీ పత్రి సుబ్బారావుకు సన్మానం చేయను నవయుగం దశరథరామయ్య తలపెట్టున్నారు. సుబ్బారావు కిప్పుడు 84 ఏళ్లు; ఎనిమిది మైళ్లయినా సునాయాసంగా నడవ గల్గిన ఉత్సాహం, శక్తి మిగిలి వుందింకా! దేముడంత ఓపిగ ఇచ్చాడాయనకు. వృద్ధాప్యంలో తనకంటూ ఏ అస్తి, ఎవరి తోడూ లేకుండా ఒంటరిగా వున్న సుబ్బారావుకు సన్మానము, పర్సు సత్కారము చేయాలన్నది సంకల్పం. అందరి సహకారమూ అభ్యర్థిస్తున్నారు - దశరథ రామయ్య గారు!

## మహారాష్ట్ర విరాళాలు

మాగుంట, రత్నం, డిసిసి వంటి పెద్దల విరాళాలు కాకుండా, విడివిడిగా జిల్లాలో మహారాష్ట్ర భూకంప బాధితులకు పోగైన జాబితా ఇది

| | |
|---|---|
| గునుపాటి రామచంద్రా రెడ్డి. | 20,000 |
| ట్యాక్సీ డ్రైవర్లు | 5500 |
| ఇవి సుబ్బారెడ్డి (మాజీ ఎం.ఎల్.ఏ) | 5,116 |
| పిఅర్ క్లబ్, గూడూరు | 5000 |
| సిఎఎం హై స్కూలు సిబ్బంది | 4700 |
| కురుగొండ హై స్కూలు విద్యార్థులు | 2500 |
| ఫత్తేఖాన్ పేట యువకులు | 2034 |
| ఓజిలి గ్రామస్తులు | 1116 |
| జె. రాధాకృష్ణమూర్తి (జిల్లా రెవిన్యూ సర్వీసెస్ సంఘం) | 1116 |
| సరోజా మైకా మైన్స్, తలుపూరు | 1116 |
| వై. ఈశ్వర రెడ్డి (ఇంటో ఆర్యన్ స్కూలు, నెల్లూరు) | 1661 |
| భక్తవత్సల నగర్ సిటిజన్స్ కౌన్సిల్ | 1000 |
| ఓజిలి చౌక డిపో డీలర్లు | 900 |
| ఓజిలి వివఒలు | 550 |
| నెమళ్లపూడి గ్రామస్తులు | 520 |
| ఇవి కృష్ణారావు (కలెక్టరేట్) | 150 |
| ఎం. ధర్మయ్య (కలెక్టరేట్) | 150 |
| చిన్న అన్నలూరు గ్రామస్తులు | 500 |
| | రు. 2,01,822 లు |

ఇతరత్రా ఎవరైనా విరాళాలు అందజేసి వుంటే, మాకు తెల్పితే వారి పేర్లు ప్రకటిస్తాము.

## సారా దినోత్సవం

సారా నిషేధ ప్రచార దినోత్సవం 30 తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో జరుగుతుంది. సాంస్కృతిక కార్యక్రమాలు వుంటాయి.

ఈ ఆహ్వానం అచ్చేసిన వారెవరండి బాబూ - తాగిన సమయంలో ప్రూఫ్ చదివారా?

## మరణాలు

రామలింగాపురం మమత నర్సింగ్ హోం అధినేత, శ్రీ డి. శ్రీహరి రెడ్డి తల్లి బద్దివోలు రుక్మిణమ్మ

రుక్మిణమ్మ గారికి ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. ప్రస్తుత ఆర్‌టిసి మేనేజింగ్ డైరక్టర్, ఐజిపి స్థాయి ఐపిఎస్ అధికారి శ్రీ ఆంజనేయరెడ్డి, ఆమె సమీప బంధువు.

వారి కుటుంబానికి మా సానుభూతి

* * *

చరిత్ర, కళలు, సాహిత్యం, శిల్పాలు, దేవాలయాలు... ఒకటేమిటి సర్వ కళలలోనూ సర్వజ్ఞతన దగిన న్యాయవాది శ్రీ ఎన్.ఎస్. కృష్ణమూర్తి ధర్మపత్ని శ్రీమతి పార్వతమ్మ (70) ఇటీవల మరణించారు. ఈ వృద్ధాప్యంలో అర్ధాంగిని కోల్పోయిన ఎన్ఎస్‌కి దుఃఖం ఎవరు ఆపగలరు?

(73) 23 తేది హఠాత్తుగా మరణించారు. అప్పటి వరకు మామూలుగానె వున్నారట - వున్నట్లుండి తలవాల్చేశారట. 9 నెలల క్రితం ఆమె భర్త మస్తాన్ రెడ్డి గారు కూడా ఇదే రీతిలో సునాయాస మరణం చెందారు. నొప్పి నోయ లేకుండా కన్నుమూసిన ఆ దంపతుల్లు ధన్యులు.

# సమర (మొదటి పేజీ కొరవ)

బయటకు నడవమన్నారు. దానికి ఈశ్వర కుమార్ ప్రాధేయ పడ్డా, ఈ టీచర్ టి.పి. నా నియోజక వర్గంలో చీరల కట్లు రాబట్టుకోడానికి ఇతను ఉపయోగ పడ్డా డన్నాడట. మంత్రి కోప్పడ్డా 'ఎంది వంకాయలు' చీరలు లేకపోతే గెలవలేమా? వంకాయలు-వాళ్ల వల్లనే మనం గెలిచి పోతామా' అంటూ కోపంగా మాట్లాడారట. ఇంక చేసేది లేక ఈశ్వర కుమార్ బయటకు వచ్చేసి పత్రికా విలేఖరుల్ని పిలిచి సమర సింహా రెడ్డిని దుయ్యబట్టారు. అప్పటి నుంచి సమర సింహా రెడ్డి పేరు పత్రికల్లో నానటం మొదలైంది. ఆయనతో పాటే వంకాయలు కూడా పత్రికల్లో మార్మోగాయి. ఈ బాధ తట్టుకోలేక సమర సింహా రెడ్డి "తాను చీరలను అవమానించలేదని. వంకాయలు అన్న మాట అప్రజాస్వామికం కాదని" పత్రికా ప్రకటన చేశారు. ఈ గొడవ జరిగినప్పుడు గుర్నాధ రావు కూడా వున్నారు కాబట్టి అతను సాక్ష్యం చెబితే సరిపోతుందని ఈశ్వరరావు చెప్పడంతో గుర్నాధ రావు నోరు విప్పక తప్పలేదు.

"సమర సింహా రెడ్డి చీరలను అవమానించ లేదని గుర్నాధ రావు తేల్చి చెప్పడంతో ఈ గొడవ సద్దుమణిగింది. ఇలా వుండగా సమర సింహా రెడ్డిని బర్తరఫ్ చేయాలంటూ తెలుగుదేశం ఎంపిలు, ఎమ్మెల్యేలు పత్రికల్లో ప్రకటనలు గుప్పిస్తున్నారు. కాంగ్రెస్‌లోని వి. హనుమంత రావు ప్రభృతులు కూడా సమర పై చర్య తీసుకోవాలని కోరారు. ఈ వివాదం కాస్త ముఖ్యమంత్రి దృష్టికి వెళ్లింది. సమరను పిలిచి ఆయన వివరం కనుక్కున్నారు. ఏదైతేనేమి మనం నోరు జారడం మంచిది కాదని ముఖ్యమంత్రి తన సన్నిహితుల దగ్గర అన్నారట.

కడప ఎమ్పీ డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి రాష్ట్ర మంత్రి జె.సి. దివాకర రెడ్డి వర్గీయులు మధ్య తాడిపత్రి నియోజక వర్గంలో కొంత కాలంగా జరుగుతున్న దౌర్జన్యకర సంఘటనలు ముఖ్యమంత్రికి అగ్ని పరీక్షగా మారాయి. ఒక పక్క పార్టీ ఎంపి, మరో పక్క మంత్రి వర్గ సహచరుడు. ఎవరికి చెప్పాలో ఎలా చెప్పాలో పాలుపోక ముఖ్యమంత్రి ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. వై.ఎస్. రాజశేఖర రెడ్డి ఇటీవల అనంతపురంలో సద్భావన సదస్సు నిర్వహించిన దగ్గర నుంచీ ఉభయ వర్గాల మధ్య గొడవలు ఎక్కువయ్యాయి. దివాకర రెడ్డి సొంత నియోజక వర్గం తాడిపత్రిలో ఇరు వర్గాల మధ్య మారణ హోమం జరుగుతోంది. ఒక వర్గం వారి ఆస్తి పాస్తుల్ని మరొకరు ధ్వంసం చేస్తే, దానికి ప్రతి క్రియగా మరో వర్గం వారు రక్త పాతం సృష్టిస్తున్నారు. ఈ రెండు వర్గాల ఘర్షణ కారణంగా ఇప్పటికే లక్షలాది రూపాయల ఆస్తి నష్టంతో పాటు ఇరువురు అనుచరులు ప్రాణాలు కూడా కోల్పోయారు. ఒక దశలో రెండు వర్గాలను చెదర గొట్టడానికి పోలీసులు కాల్పులు కూడా జరిపారు. రాజశేఖర రెడ్డి ఉద్దేశ పూర్వకంగానే తన జిల్లాలో వేలు పెడుతున్నాడని దివాకర రెడ్డి అంటున్నారు. రాజశేఖర రెడ్డిని మొదట్లోనే నివారించక పోతే జిల్లాలో తమ రాజకీయ మనుగడకు ప్రమాదం వుంటుందని దివాకర రెడ్డి వర్గీయులు రెచ్చి పోతున్నారు. రాజశేఖర్, దివాకర్ వర్గాల మధ్య ఎన్ని గొడవలున్నా ఎవరూ తెగించి నేరుగా బయట పడలేదు. అయితే ఆ కొరత కూడా లేకుండా ఇటీవలే దివాకర రెడ్డి బహిరంగంగా వై.ఎస్. పై ధ్వజమెత్తారు. వై.ఎస్. తన ఇష్టం వచ్చినట్లు పార్టీ పెద్దల్ని దుయ్యబడుతున్నాడని. దాని వల్ల పార్టీకి నష్టం కలుగు తోందని వై.ఎస్. పై చర్య తీసుకోవాలని దివాకర్ డిమాండ్ చేశారు. దివాకర రెడ్డి ప్రకటన వచ్చిన మరునటి రోజునే తాడిపత్రి నియోజక వర్గంలో హింసాకాండ జరిగింది. రాయలసీమలో ఇటువంటి సంఘటనలు కొత్త కాకపోయినా సాక్షాత్తు రాష్ట్ర మంత్రి, పార్టీ ఎంపిల మధ్య జరగటం జిల్లా అధికార యంత్రాంగాన్ని, పోలీసుల్ని ఇరకాటంలో పడేశాయి. హింసాత్మక సంఘటనలు జరుగుతున్నప్పుడు ముఖ్యమంత్రి ఢిల్లీలో మకాం చేసి వుండటం వల్ల వీటి పై ఆయన స్పందన తెలీలేదు. ముఖ్యమంత్రి ఢిల్లీ నుంచి తిరిగి రాగానే వై.ఎస్., దివాకర్ వర్గీయులు ఒకరి పై మరొకరు బురద చల్లుకుంటూ ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేసుకున్నారు. జె.సి. దివాకర రెడ్డి స్వయంగా ముఖ్యమంత్రిని కలిసి తన బాధ వెళ్ల బోసుకున్నారు. వై.ఎస్. వర్గీయులు ఫోన్‌లో కోట్ల వారికి గోడు విన్నవించు కున్నారు. దీంతో ముఖ్యమంత్రికి ఎటు చెప్పాలో, ఎవరిని సమర్థించాలో దిక్కు తోచక అనంతపూర్ జిల్లా కలెక్టర్, ఎస్.పి.ల పై ఈ భారాన్ని వుంచారు. జిల్లాలో ఇక మీదట ఎటువంటి దౌర్జన్యకర సంఘటనలు జరిగినా, దాని వెనుక ఎంత గొప్ప వ్యక్తులున్నా వెనకా ముందు చూడకుండా తగు చర్య తీసుకోవాలని ముఖ్యమంత్రి జిల్లా యంత్రాంగాన్ని ఆదేశించి చేతులు దులుపుకున్నారు.



## జలగంకు షోకాజ్

మాజీ మంత్రి జలగం ప్రసాద రావు పై క్రమశిక్షణ చర్య తీసుకునేందుకు రంగం సిద్ధమైంది. రాష్ట్ర మంత్రి వర్గ పునర్వ్యవస్థీకరణ తర్వాత ప్రసాద రావు ముఖ్యమంత్రి పై ధ్వజమెత్తిన సంగతి తెలిసిందే. ప్రసాద రావు ప్రవర్తనను ఆగ్రహించిన ముఖ్యమంత్రి ఖమ్మం జిల్లాలో ప్రసాద్‌ను రాజకీయంగా ఒంటరి వాణ్ని చేసేందుకు సకల శక్తులు ఉపయోగించారు. చివరకు జలగం వర్గం వారే గోర్ అయిన కొత్తగూడెం ఎమ్మెల్యే వనమా వెంకటేశ్వర రావును కూడా బయటకు లాగి జలగం ప్రసాద్ పై అవినీతి ఆరోపణలు చేయిస్తూ ప్రకటన లిప్పించారు. పార్టీ పరంగా ప్రసాద్ పై క్రమశిక్షణా చర్యలు కూడా తీసుకుంటే ఇక పై ఆయన నోరు మెదిపే అవకాశమే వుండదని ముఖ్యమంత్రి భావించి ఇందుకు రంగం సిద్ధం చేయాల్సిందిగా పిసిసి అధ్యక్షుణ్ని కోరారు. ఈ మేరకు పిసిసి అధ్యక్షుడు జలగం ప్రసాద్‌కు షోకాజ్ నోటీస్ ముసాయిదా ప్రతిని సిద్ధం చేసి ముఖ్యమంత్రికి చూపించి గ్రీన్ సిగ్నల్ పొందారు. షోకాజ్ నోటీస్ అందుకున్న జలగం ప్రసాద్ స్పందన ఎలా వుంటుందో, ఖమ్మం జిల్లాలో దీని ప్రభావం ఏమిటో వేచి చూడాల్సిందే.

## సణుగుడు

5 పేజీ కొరవ

మంత్రి గారిట్లా విరుచుక పడటం వెనుక జిల్లా రాజకీయాలలో వస్తాయనుకున్న మార్పుల కోసం "చేసిన బాసలు" "వేసిన పథకాలు" మర్చి పోయినట్లు నటించే వారి పట్ల ఉక్రోషం ఏదైనా వుందంటారా? ఏమో - ఆ గొడవ నాకెందుకు లెండి!

* * *

పది మంది వినేటట్లు జరిగిన ఈ గొడవ ఒక్కటే కాదు. ఈ మధ్య జిల్లా రాజకీయాలు తరచు వీధికెక్కుతున్నాయి. నాలుగు గోడలకు పరిమితమై, చెవులు చెవులు కొరుక్కోవడంగా వుండ వలసిన నాయకుల మనోభావాలు పబ్లిక్ మీటింగు లౌతున్నాయి. పెళ్లిళ్ల, కరమంత్రాల షామియానాల క్రింద జిల్లా రాజకీయ సమావేశాలు జరిగి పోతున్నాయి.

సీనియర్ నాయకులనుకునే వారు కూడా ప్రక్క నెవరుండేది పట్టించు కోకుండా, అందరూ వింటున్నారన్న స్పృహ లేకుండా మాట్లాడేస్తున్నారు. చూసే వారికవి పిల్ల చేష్టలుగా కన్పడుతున్నాయి. రాజకీయాలు వీధిన పడుతున్నాయి. నాయకులు చులకనై పోతున్నారు.

కొత్త కొత్త గ్రూపులు కట్టాలన్నది జిల్లాలో చాలా మందికి జీవితాభిలాష. అందరూ అదే మాట్లాడుతారు; ఒకరికి తెలియకుండా మరొకరు హైదరాబాదుకు వెళ్లి మాకే పాపం తెలియదని విన్నవించు కొని వస్తారు. పిల్లికి గంట కట్టే ధైర్యం ఎవరిలోనూ లేదు; అట్లని మాట్లాడడం మానరు. దీని వల్ల ఒకరి పట్ల ఒకరికి అనవసర స్పర్థలు పెరిగి పోతున్నాయి; ఒకరి నొకరు అనుమానంగా చూసుకునే పరిస్థితి ఏర్పడుతూంది. అందరూ చులకనై పోతున్నారు. ఎన్నికలు ఏడాదిలో పెట్టుకొని కాంగ్రెస్ నాయకులు ఇటువంటి పిల్ల చేష్టలు చేయడం నగుబాటుగా వుంది. ఇప్పటికైనా ఎవరికి వారు తమ హుందాతనం నిలబెట్టుకొంటే పార్టీ పరువు నిలుస్తుంది.

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ)

25లక్షలు, పట్టు పరిశ్రమకు 20లక్షలు, మత్స్య పరిశ్రమకు గే 53లక్షలు, పశుసంక్షేమానికి 28లక్షలు ఖర్చుపెడుతున్నారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో ఎమ్మెల్యే జె.కె.రెడ్డి నలుగురు లబ్ధిదారులకు 20వేల రూపాయలు విలువ జేసే టెలిఫోన్ బూతు, 6వేలు చేసే బంకు, 10వేలు చేసే ప్రొవిజన్ స్టోరు, సైకిల్‌షాపుకు మంజూరు పత్రాలు పంపిణీ చేసారు. కలెక్టర్ ఎం.సాంబశివరావు, ఎమ్పీ కుమారి పద్మశ్రీ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## సుబ్బులు నాయుడు ఇంత దిగజారాడా?

ఒకప్పుడు కావలి తాలూకా రాజకీయాలలో కీలక పాత్ర వహించిన గొట్టిపాటి కుటుంబానికి చెందిన సుబ్బులు నాయుడు మోసానికి పాల్పడి ఇరవై ఐదు కుటుంబాలను నిలువునా ముంచాడన్న వార్త వినవస్తున్నది. మహారాష్ట్రలో కోళ్ల ఫారం లోన్లు ఇప్పిస్తానని చెప్పి, తమను నమ్మించి, 20 లక్షలకు ముంచాడని బాధితులు పత్రికల కెక్కారు. తెలుగుదేశం నాయకుడు కాబట్టి, ఎన్టీఆర్ మధ్యస్థం చేసి, సుబ్బులు నాయుడును కనీసం 12 లక్షలు తిరిగి చెల్లించ మన్నారట. జీర్ణమై పోయిన డబ్బు తిరిగి ఎక్కడి నుంచి వస్తుంది?

దురాశ మనిషిని ఎంతకైనా దిగజారుస్తుంది. అందుకు పెద్ద కుటుంబమైనా, చిన్న కుటుంబమైనా మినహా యింపేమిటి? నాయుడు గారూ - ఇప్పటికైనా తప్పుకు చెంపలేసుకుని పోయిన పరువు కాపాడుకోండి!

## పంచాంగము

1 తేది సోమవారం గురుమౌఢ్యమి

### ముహూర్తములు

5 తేది శుక్రవారము ఉదయం 9.48 గంటలకు ధనుర్లగ్నమున వివాహ ఉపనయన వ్యాపారారంభ గృహారంభములకు

రాత్రి 3.48 గంటలకు కన్యా లగ్నమున వివాహ గృహారంభములకు సుముహూర్తము లున్నవి.

### అక్టోబరు తిథులు

ఆశ్వయుజ శుద్ధ

తే 30శని పూర్ణిమ సా.గ. 5.05 వ

ఆశ్వయుజ బహుళ

తే 31ఆది పాడ్యమి రా.గ. 6.54 వ

### నవంబరు తిథులు

తే 1 సోమ విదియ రా.గ. 8.20 వ

తే 2 మంగళ తదియ రా.గ. 9.20 వ

తే 3 బుధ చతుర్థి రా.గ. 9.50 వ

తే 4 గురు పంచమి రా.గ. 9.45 వ

తే 5 శుక్ర షష్ఠి రా.గ. 9.15 వ

స్వయంపాకుల శ్రీనివాసులు.

ఎం.ఎ

## రామచంద్రాపురం సబ్‌జడ్జి వారి కోర్టులో

Between:-

O.S. 90/84 : EP 14/93.

DHR వాది పులగం సూర్యనారాయణ రెడ్డి

Vs

JDRప్రతి వాదులు. 1. సత్తి అమ్మిరెడ్డి, 2. తేతలి వీరెడ్డి.

ఈ నంబరు డిక్రీబాకీ వసూలు నిమిత్తము 1.వJdr ప్రతివాది తాలూకు యిస్తి హారు దాఖలా ఆస్తులు. ఇస్తిహారు షరతులకు లోబడి 3.12.1993 సం. తేదిన పుదయం పదిన్నర గంటలు లగాయితు సాయంకాలం 5.30 గంటల వరకు పై కోర్టు వారి ఎదుట వేలం వేయబడును. కాన సదరు వేలంలో పాడుకొన దలచిన వారు 3.12.1993 సం. తేదిన పై కోర్టు వారి ఎదుట హాజరయి పాడుకొన వలసినదిగా యావన్మందికి యిందు మూలముగా తెలియపరచడమైనది.

షెడ్యూలు: తూర్పు గోదావరి జిల్లా, రాయవరం మండలం, రామచంద్రాపురం, సబ్.డి.రి. లో చేర్ని, కుతుకులూరు గ్రామం తాలూకు 1 వ ప్రతివాది & JDr తాలూకు వేలం కావలసిన ఆస్తి వివరములు.

జి. పల్లం R.S. No. 135/2 రు. పూరాయ 3.06 ట్లలో

దక్షిణం వయిపు యు. 1.53 సెంట్లు = 0.619 హెక్టార్సుకు; తూర్పు: దారిగట్టు; పడమర: పులగం బుల్లియ్య గారి భూమి; వుత్తరం: సత్తి సత్యవతి గారి భూమి; దక్షిణం: సత్తి బస్వి రెడ్డి గారి భూమి;

సదరు హద్దులకు మధ్యస్థమయిన యు.1.53 సెంట్ల భూమిన్ని అందలి నానా విధఫల వృక్షములు, మామూలు నీటు వసర్లు, ఈజిమెంటు హక్కులు వగయిరా సహా వేలం కాబడును.

DHrs Value Rs. 30,000/-

Amin's Value Rs. 91,800/-

రామచంద్రపురం: 9.10.93

డి. బుచ్చిరాజా
వాదితరపు అడ్వొకేటు

# శివారెడ్డి పద్యాలు

### జెవి రెడ్డి

వరువు సాములన్న, సారస్వతంబన్న
పేదసాదలన్న ప్రీతిమెండు
కావరానెరావు కల్ల కాపట్యాలు
జె.వి. రెడ్డి! నీకు దివె పాటి!

### కాలయముడు

అంతరించి పోయె అలసాని పెద్దన్న
పోయె దివికి బమ్మెర పోతరాజు
ఇక్కడుండి నేను ఏముంది చేసేది
కాలయముడు యింకా కనికరిల!

### పెళ్లిళ్లు

ఎవరు వృద్ధురాలో ఏయమ్మ జవరాలో
దాసి యెవరో వచ్చి మోసం గురుడ!
పెళ్లి కూతురురెవరో పెద్ద ప్రాబ్లమైంది
అందరొకటె అచ్చు ఆడవారు;

### ప్రొద్దు వాటాలింది

వయసుకొచ్చు ప్రొద్దువాటాలి పొయ్యింది
ఎప్పుడేమవుద్దో సెప్పుగాదు
పైకిబోతె కవిని పద్యాలు యుకరావు,
మళ్ళి మళ్లి రాదు మంచిరోజు!

### నాగరికులు

కొత్తప్రాయపోళ్లి కుర్రోళ్లి పనివాళ్లి,
నిన్న మొన్నటోళ్లి, వున్న నిజము
ఇంతలోనె యినుబదేళ్లు యీ కవికంటె
నాగరికులు మీరు నమ్ముకోరు!

### కన్నతల్లి

ఎంతకాలమైందో ఏనాడు బుట్టిందో
కాంగ్రెసు సంస్థ కన్నతల్లి
మట్టుబెట్టకండి మంత్రినత్రములార!
పూడగొట్టకండి వుండనీండి

జుట్టు బట్టుకొని పోట్లాడు కుంటున్నారు
తప్పుగాదు దాన్ని తరచరాదు
దెబ్బదింటె కాంగి దేశమ్ము పాలైతె
ఆంధ్ర రాష్ట్రమునకు అప్రతిష్ట!

☆☆☆

## నెల్లూరు సంగతులు

(4 వ పేజి కొరవ)

రూములో జరిగిన చిన్మయా మిషన్ సత్సంగ కార్యక్రమంలో పాల్గొని ప్రసంగించారు. ముఖ్య అతిధిగా విచ్చేసిన హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ సన్నపురెడ్డి దశరథ రామిరెడ్డి గారు మాట్లాడుతూ హక్కుల కోసం పోరాడి విధులను విస్మరించే విధంగా ప్రజలు తయారైన నేటిరోజుల్లో భగవద్గీతలోని నిష్కామ కర్మ ఆచరణ బాధ్యతలను గుర్తు చేస్తుంది. ధర్మాచరణకు సంబంధించి చక్కని ప్రబోధనలను స్వామి చిన్మయానంద చేసిన ప్రచారం సదా స్మరణీయమని ప్రసంసించారు. మిషన్‌లో విస్తృత సేవలందిస్తున్న శ్రీమతులు కన్యాకుమారి, సరోజనమ్మ, కుమారి సునీత, చిన్నారులు దేవిక, లావణ్యలకు న్యాయమూర్తి జ్ఞాపిక లందచేసారు. అనంతరం జస్టిస్ దశరధరామి రెడ్డి గారిని స్థానిక చిన్మయా మిషన్ కూడా ఘనంగా సన్మానించింది. కార్యక్రమంలో జిల్లా జడ్జి శ్రీ ఇస్మాయిల్ అదనపు జిల్లా జడ్జి శ్రీ సూర్యనారాయణ రావు తదితరులు పాల్గొన్నారు. సభారంభానికి ముందు చిన్మయా బాలవిహార్ సభ్యులు వల్లించి, గీతా శ్లోకాలు ఆహూతులను ఆహ్లాదపరిచాయి.

### పీర్‌లెస్ 62వ వార్షికోత్సవం

పీర్‌లెస్ సంస్థ 62వ వార్షికోత్సవ సభ 25తేది రాఘవ కళ్యాణ మండపంలో ఘనంగా జరిగింది. ముఖ్యఅతిధిగా విచ్చేసిన అడిషనల్ జిల్లా జడ్జి పి. సూర్యనారాయణ రావు మాట్లాడుతూ దేశంలో అతిపెద్ద నాన్ బ్యాంకింగ్ వ్యవస్థగా పీర్‌లెస్ కొనసాగుతూ నిరుద్యోగ సమస్యను కొంతవరకైన నిర్మూలించగలగడం గొప్పవిషయ మన్నారు. సంస్థ సీనియర్ ఇన్స్‌పెక్టర్ కోటేశ్వర రావు తన ప్రసంగంలో దేశంలో పీర్‌లెస్‌కు 140పైగా బ్రాంచిలు వున్న విషయం, ప్రతి 20మంది భారతీయుల్లో ఒక పాలసీ దారుడు వున్నారని వివరించారు. సమావేశంలో జిల్లా వ్యాప్తంగా వున్న వెయ్యిమందికి పైగా ఏజంట్లు పాల్గొన్నారు.

### సంగీత కళానిధి శత జయంతి సభ

ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసులు డాక్టర్ ద్వారం వెంకట స్వామి నాయుడు శత జయంతి సభను నవంబర్ 3తేది వర్థమాన సమాజం జరుపుతుంది. టౌన్‌హాల్‌లో జరిగే ఈ సభకు అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు. వుపన్యాసకులు రిటైర్డ్ జిల్లా జడ్జి కె.జి.నారాయణ రావు, ఇలపావులూరు కామేశ్వర రావు. సభానంతరం యువకళాకారులు కె.శౌరి రాజన్, కె.వెంకటకృష్ణన్‌ల వయోలిన్ కచ్చేరి వుందని సమాజం కార్యదర్శి బి.వి.నరసింహం తెలుపుతున్నారు.

### భూకంప బాధితులకు స్వాతంత్ర యోధుల సాయం

మహారాష్ట్ర భూకంప బాధితులకు సహాయ మందించేను పలువురు మానవతా వాదులు ముందు కొస్తున్నారు. ఈ మేరకు జిల్లా స్వాతంత్ర సమర యోధుల సంఘం 1500రూపాయల డ్రాఫ్ట్ ముఖ్య మంత్రి నిధికి పంపినట్లు సంఘం కార్యదర్శి ఎ.వీరరాఘవయ్య తెలుపుతున్నారు. జిల్లా కేంద్ర సహకార బ్యాంకు వుద్యోగులు సానుభూతి తెలియజేస్తూ సిబ్బంది మొత్తం ఒకరోజు వేతనాన్ని విరాళంగా ఇస్తున్నట్లు ఎంప్లాయిస్ అసోసియేషన్ సెక్రటరీ ఎ.వెంకటరామయ్య చెప్పారు.

### స్వర్గయానం ఆవిష్కరణ సభ

24 తేది సాయంత్రం టౌన్ హాల్లో జిల్లా లేబర్ ఆఫీసర్ శ్రీ దేవర పల్లి నాగయ్య రచించిన స్వర్గయానం పద్య కావ్యాన్ని శ్రీ సి.సి. సుబ్బరాయులు శెట్టి కృతి స్వీకారం చేశారు. ఈ సందర్భంగా జరిగిన సభకు ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షించారు. ఈనాటి సమాజంలో వున్న చెడు నడవడికలకు విసిగి నాగయ్య కవి స్వర్గానికి ప్రయాణం కట్టారు. బొందితో స్వర్గం చేరి అక్కడ వున్న కీర్తిశేషులు, జాతి రత్నాలు, సాహితీ ప్రముఖులతో మాట్లాడి పలు అంశాలతో కమనీయ పద్య కావ్యంగా సాహితీ విందు చేశారని చమత్కరించారు తన వుపన్యాసంలో గోపాల్ రెడ్డి గారు.

గ్రంథావిష్కరణ చేసిన అనంతరం జస్టిస్ సన్నపురెడ్డి దశరథ రామిరెడ్డి మాట్లాడుతూ ప్రజలను సమకాలీన సమస్యలు బాధిస్తున్న తీరు తెన్నులను కవి సులభంగా అర్థమయ్యే విధంగా చక్కని పద్యాలు వ్రాశారు. బహు భార్యాత్వం నేడు నేరమే అయినా, కృతి కన్యల నెందరినైనా చేపట్టవచ్చు; పలు కావ్య కన్నెల పాణిగ్రహణం చట్ట సమ్మత మేనని హాస్యధోరణిలో చెప్పారు. విద్వత్కవి ముదివర్తి కొండమాచార్యులు గ్రంథాన్ని సమీక్షిస్తూ చాతక పక్షికి వార్షుక మేఘం లాగా మరుభూమిలో పయనించే వానికి చలివేంద్రం లాగా, లోక గతి తీరు తెన్నులను పరిశీలన చేస్తూ ఆలోచన రేకెత్తించిందన్నారు. ప్రముఖ చార్టర్డ్ అకౌంటెంట్ శ్రీ డి.వి. రమణయ్య, కృతికర్త శ్రీ దేవరపల్లి నాగయ్య కూడా ప్రసంగించారు. శ్రీ అల్లా కృష్ణమూర్తి ప్రార్థనా గీతా లాపనతో ప్రారంభమైన సభ కార్యదర్శి శ్రీ బి.వి. నరసింహం వందనాలతో ముగిసింది.

### బెస్ట్ ఇన్స్టిట్యూట్ మాడరన్ స్కూలు

శ్రీ శారదా సాహితీ సంస్థ పండుగలకు, పబ్బాలకు ఒక మంచి కార్యక్రమం ఏర్పాటు చేసి, సమాజానికి గుప్తంగా సేవ చేసిన వ్యక్తులను గుర్తించి సన్మానించడం రివాజుగా పెట్టుకొంది. వీటితో పాటు దసరా నవరాత్రులను రామాజీ వీధిలోని ఆంజనేయ స్వామి ఆలయంలో నిత్య అలంకరణ శోభితంగా నిర్వహించింది. భారత, భాగవత, రామాయణ, భగవద్గీతలలోని ప్రముఖ అంశాల పై ధార్మిక వుపన్యాసాలు కూడా ఏర్పాటు చేసింది. చివరి రోజైన విజయదశమి నాడు ఒక చిన్న పాటి సభను నిర్వహించి టౌన్‌లో చక్కని విద్యా ఫలితాలు సాధించిన సంస్థ మాడరన్ స్కూల్‌కు బెస్ట్ ఇన్స్టిట్యూట్ అవార్డును రచయిత శ్రీ అంబడిపూడి చేతుల మీదుగా స్కూల్ కరస్పాండెంట్ శ్రీ వి. విజయకుమార్ రెడ్డికి అందజేశారు. ప్రతిదినం ధార్మిక ప్రవచనం చేసిన శ్రీ ఉదాలి నరసింహ శాస్త్రిని శ్రీ కె. గంగాధర రెడ్డి సన్మానించారు. కార్యక్రమంలో డాక్టర్ అమృత వాక్కుల శివకుమార్ కూడా పాల్గొన్నారు. చివరన సంస్థ వ్యవస్థాపకులు శ్రీ బి. సీతారామ శాస్త్రి వందనాలు చెప్పారు.

## అసెంబ్లీ ఎన్నికలు

(2 పేజి కొరవ)

వివాదం ప్రధాన సమస్యగా పరిగణనకు రావడం లేదు. అధిక సంఖ్యాకులు ధరల పెరుగుదల పట్లనే ఎన్నికల నిర్ణయం తీసుకోవా లనుకుంటున్నారు. మండల్ సమస్యను ఎవరూ పట్టించు కోవడం లేదు. నిరుద్యోగం, ధరల పెరుగుదల, అవినీతి తర్వాతనే అయోధ్య ప్రస్తావనకు వస్తున్నది. ముస్లింలు కూడా అదే అభిప్రాయంలో వున్నారు.

"వీక్" ప్రజాభిప్రాయ సేకరణ ఫలితాలివి. దీన్ని బట్టి స్పష్టంగా అర్థమౌతున్న దొక్కటె - దేశంలో కాంగ్రెస్, బిజెపిలు మాత్రమే ప్రజల దృష్టిలో రాజకీయ పార్టీలుగా చలామణి అవుతున్నాయి. కమ్యూనిస్టులు, జనతాదళ్ నాయకులను ప్రజలు కాగితం పులులుగా భావిస్తున్నారు. ఎంతో ఆర్భాటంగా రంగంలోకి దిగుతున్న ములాయం సింగ్ యాదవ్, కాన్షిరాంలనూ జనం పట్టించు కోవడం లేదు, విపిసింగ్, చంద్రశేఖర్, అజిత్ సింగ్, దేవీలాల్‌ల కలయిక ఏ మాత్రం ప్రభావం చూపడం లేదు. రానున్న రోజులలో దేశ రాజకీయాలలోని వివిధ శక్తులన్నీ బిజెపి, కాంగ్రెస్‌లలో ఏదో ఒక ప్రక్క చేరక తప్పని పరిస్థితి కన్పిస్తున్నది. సహజ సిద్ధంగా దేశం రెండు పార్టీల ప్రజాస్వామ్యం వైపు పయనిస్తున్నదనడానికి ఇదొక గుర్తు. ప్రస్తుతానికి మాత్రం బిజెపి అధికార పీఠానికి చేరువైనట్లే లెక్క!

ఇప్పుడైన కల మేలుకుంటే తప్పు. లోకసభ ఎన్నికల నాటికి కాంగ్రెస్‌కు పుట్టగతు లుండవు.

### నీటి మట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 13.5 అ |
| సర్వేపల్లి చెరువు | 6.15 అ |
| కనిగిరి రిజర్వాయరు | 16.9 అ |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| బంగారు సవర | 3,440/- |
| వెండి (10 గ్రా) | 62/- |
| రిటైల్ ధరలు | |
| వేరుశనగ నూనె (కెజి) | 35/- |
| మిరపకాయలు (కెజి) | 15/- |
| కొబ్బరి నూనె (కెజి) | 48/- |
| చింతపండు(కెజి) | 18/- |
| చక్కెర (కెజి) | 11.50/- |
| బెల్లం (కెజి) | 14/- |
| మినపప్పు (కెజి) | 10.50/- |
| పెసరపప్పు (కెజి) | 14/- |

# సినిమా మోజులో శీలం హరీ!

సినిమాలో చేరి శ్రీదేవిలా తారాపథాన్నందుకుంటే పేరు ప్రఖ్యాతులు, బంగళాలు, కార్లు, అస్తిపాస్తులతో కోటికి పడగెత్తవచ్చనే వ్యామోహంలో కొందరు యువతులు ఉంటారు. అలాంటి వారిని వెతికి పట్టుకుని, సినిమా ఛాన్సులు ఇప్పిస్తామని లేనిపోని ఆశలు పెట్టి తమ వశం చేసుకుని, వాళ్లను వడుపు వృత్తిలోకి దింపే ఒక ముఠా గుట్టు ఇటీవల బయట పడింది. హైదరాబాద్ బేగంపేటలో కళావతి (40), గుండమ్మ (50) అనే స్త్రీలు కొంత మంది యువతులను వలలో వేసుకుని, వాళ్లను సినిమాలలో జూనియర్ ఆర్టిస్టులుగా పంపుతున్నా మంటూ వాళ్ల చేత నికృష్టమైన జీవితాన్ని గడిపిస్తుండగా పోలీసులకు పట్టుబడ్డారు. ఇటువంటి ముఠాలు హైదరాబాద్‌లో మరికొన్ని ఉన్నట్లు పోలీసులకు తెలిసి, ఆరా తీస్తున్నారు. గోల్కొండ ప్రాంతంలో ఒక ఫిలిమ్ ఆక్టింగ్ స్కూల్‌లో కూడా గతంలో ఇలాంటి అన్యాయాలు జరుగుతున్నాయని తెలిసి ఆ ప్రాంతీయులే వారిని తరిమేశారట.

## నెల్లూరులో "జడ్జి గారి అబ్బాయి"

ఎన్. కొండల రావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. భాస్కర రావు, పసుపులేటి శ్రీనివాసులు నిర్మించే "జడ్జి గారి అబ్బాయి" చిత్రం షూటింగ్ నెల్లూరులో అయిదు రోజుల పాటు జరిగింది. అచ్యుత్, రేష్మ, రంగనాథ్, బ్రహ్మానందం, బాబూమోహన్, రాళ్లపల్లి, నర్రా వెంకటేశ్వర రావు, పి.జె. శర్మ, ఎం.ఎస్. రావు, పి.వి. రమణ, భాస్కర రావు, రాకేష్, దివ్య, ప్రేమ పాత్రధారులు. సంగీతం: మురారి బాబూరావు, ఛాయ: ఆర్. రామారావు.

## మళ్లీ గీతాంజలి

"వాణిశ్రీ, శారద, జయచిత్రలు పోషించే కేరెక్టర్స్ ధరించాలని ఉంది" అంది మాజీ నటి గీతాంజలి. నటుడు రామకృష్ణను వివాహ మాడటంతో 17 ఏళ్ల పాటు తెరమరుగున ఉన్నారామె. ఇప్పుడామె పద్మాలయ వారి "పచ్చతోరణం" చిత్రంలో నటిస్తోంది. "మా అబ్బాయి పెద్ద వాడయ్యాడు. కాలేజీలో చదువుతున్నాడు. ఇంటి పట్టున నాకేమీ తోచడం లేదు. కుట్టి పద్మిని టి.వి. సీరియల్ కిట్టుగాడులో వార్డెన్ కేరెక్టర్ వేయమని కోరింది, సరేనన్నాను. ఆ తర్వాత పద్మాలయ వారు అడిగారు. వివాహమైన తర్వాత కొందరు తారలు మళ్లీ నటిస్తున్నారు. నేను కూడా ఎందుకు నటించకూడదూ అనిపించింది. మంచి పాత్రలు ఉంటేనే నటిస్తాను. మా వారు కూడా అడపా దడపా సినిమాలలో నటిస్తూనే ఉన్నారు కదా" అందామె.

## మణిరత్నం చిత్రంలో బాలు

ఎంతో బిజీగా ఉన్న ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం అడపా దడపా కొన్ని చిత్రాలలో మొహమాటం కోసం నటించక తప్పలేదు. ఐతే, మణిరత్నం దర్శకత్వం వహించే "తిరుడా

కొరవ 11 వ పేజీలో)



రైల్వేకూలీ చిత్రంలో మమ్ముట్టి, మీనా

# 'రేటు తర్వాత చెప్తా!'

చిత్రం హిట్ అయితే ఇట్టే రేటు పెంచేయడం తారలకు మామూలే. సౌందర్యను ఒక నిర్మాత బుక్ చేయదలిస్తే "మీ చిత్రంలో నేను తప్పకుండా నటిస్తాను. నేను, కృష్ణగారితో నటిస్తున్న 'నెంబర్ వన్' చిత్రం విడుదలయ్యాక నా రేటు గురించి మాట్లాడుకుందాం" అందట. దానితో ఆ నిర్మాత నివ్వెరపడి పోయాడు. ఆ చిత్రం గొప్ప హిట్ అవుతుందని ఆమె నమ్మకమేమో!




## అర్జున్ డబ్బింగ్ చిత్రాలు

"జెంటిల్‌మెన్" చిత్రంలో శరత్ కుమార్ నటించ వలసింది. కాల్ షీట్లు లేక పోవడంతో అర్జున్‌ను ఒప్పించారు. ఆ చిత్రం హిట్ కావడంతో అదే పేరున ఎ.ఎం. రత్నం దాన్ని తెలుగులోకి డబ్ చేసి విజయవంతం చేశారు. దీనితో అర్జున్ డబ్బింగ్ చిత్రాలకు ఒక ఊపు వచ్చింది. "ఘరానా మొగుడు" లో అర్జున్, మాలాశ్రీ నాయకా నాయికలు. సంగీతం: విద్యాసాగర్, దర్శకత్వం: సాయిమోహన్. కె.ఎస్.ఆర్.దాస్ తమిళంలో సమర్పించే "రోజా వే కిల్లాదే" తెలుగులో "బాడీ గార్డ్"గా పరివర్తనం చెందుతోంది.

# రజని సన్యాసం?

దక్షిణ భారతంలో తొలిసారిగా కోటి రూపాయల పారితోషికం పుచ్చుకున్న ప్రసిద్ధ నటుడు రజనీకాంత్‌లో ఇటీవల ఎంతో మార్పు కనిపిస్తోంది. ఎప్పుడూ రాఘవేంద్ర స్వామిని స్మరిస్తుంటాడు. సిగరెట్ మానేశాడు. హిమాలయాల వైపు పర్యటించి వస్తానని ఇటీవల ఒంటరిగా బయల్దేరాడు. ఎక్కడుండేది తెలియదు; చిరునామా తెల్పలేదు. ఏమి చేస్తున్నాడో అసలే తెలియదు. అప్పుడప్పుడు తన ఇంటికి ట్రంక్ కాల్‌లో మాట్లాడ్తుంటాడే గాని, ఎక్కడ్నుంచి ఫోన్ చేసిందీ చెప్పడం లేదని అతని భార్య లత తెలిపింది.

# హేమమాలిని వద్దన్న పాత్ర!

హేమమాలిని తమిళ వనిత అన్న విషయం అందరికీ గుర్తుండే ఉంటుంది. ఇటీవల ఒక తమిళ నిర్మాత ఆమెను కలుసుకుని తన చిత్రంలో క్లిష్టమైన పాత్రను ధరించ వలసిందిగా కోరాడు. ఆమె కథ వినిపించమని విని, "ఏమిటీ? ఫస్ట్ సీన్‌లో నేను కాలేజీలో చదువుకునే యువతిగా కనిపిస్తానా? జనం నవ్వుతారు" అంది. డాన్స్ ప్రాక్టీస్ వల్లో, మితాహారం వల్లో మీరింకా చాలా యంగ్‌గానే కనిపిస్తున్నారు. అంచేత, మీరు ఆ వేషం వేయక తప్పదు అని నిర్మాత ఎంతగానో కోరాడట. క్షమించాలి, మీరు ఎంత డబ్బిచ్చినా ఈ రోజు నేనా వేషానికి పనికి రాను. మీకు నష్టం రావడం నా కిష్టం లేదు. దయచేసి నా కన్నా తక్కువ వయసులో ఉన్న మరే నటినైనా బుక్ చేయండి అని చెప్పి పంపిం చేసిందట. అదే మరొక తారయితే ఆ వేషాన్ని ఇట్టే అంగీకరించి, ఆ వేషాన్ని ధరించడానికి లంఖణాలు ఉండి, నాజూకుగా నటించడానికి ఎంత తాపత్రయ పడేదో!

శృంగారం శృతిమించినా రసజ్ఞులకు పసందైన విందు

# శ్రీనాథ కవిసార్వభౌముడు

శ్రీనాథుని సమగ్ర జీవితానికి ప్రతిబింబం యన్టీ రామారావు నటించిన "శ్రీనాథ కవి సార్వభౌముడు" చిత్రం. ఇది పదిహేనవ శతాబ్దపు చారిత్రకాంశం. శ్రీనాథ కవితా కళా సారాంశం. కవి సార్వభౌముని మహా కావ్యాల రసజ్ఞ రసాయనం.

శ్రీనాథుడు కవి సార్వభౌముడు. ఆనాడు వెలిసిన కవితా సామ్రాజ్యానికంతటికీ ఆయన చక్రవర్తి వంటి వాడు. ఆయన కవితా సామ్రాజ్య వైభవం ఒక స్థానాన్ని, ఒక ఆస్థానాన్ని అంటి పెట్టుకొని వుండక, కర్ణాటక దేశమంతటా పర్యటించి, ఘంటా ఘోషంగా తన విజయాన్ని చాటుకుంది. కర్ణాటక రాజ సభాస్థలిలో సంస్కృత కవి గౌడ డిండిమ భట్టును ఓడించి ఆయన విజయ చిహ్నమైన కంచు ఢక్కను పగులగొట్టి, ఆ సాహిత్య సభలో ప్రౌఢ దేవరాయలచే కనకాభిషేకం పొందాడు శ్రీనాథ కవి. తెలుగు భాషా సరస్వతిని సంస్కృత సింహ పీఠం పై అధిష్ఠింప జేశాడు.




శ్రీనాథుడు శృంగార యోగి, ప్రణయ వీరుడు. స్త్రీల అంద చందాలలోని, వయ్యారాల లోని శృంగారాన్నే కాదు భిక్షాన్న మిచ్చే విశాలాక్షి పసిడి కుండల బోలు పాలిండ్ల భారాన్ని కూడా సుందర మయం చేశాడు ఆయన తన కవితలో.

శ్రీనాథుడు ఈశ్వరార్చన కళాశీలుడు. ఒకే కంటితో శివుణ్ని, శృంగారాన్ని కూడా దర్శించిన వాడు. సౌందర్య పోసకులలో అగ్రశ్రేణి కవి అతడు.

శ్రీనాథుని జీవితం ఎత్తు పల్లాలతో కూడినది. దీనార టంకాల తీర్థమాడిన వాడే, రత్నాంబరాలు ధరించిన వాడే, బంగారు కంచాలలో భుజించిన వాడే, "కస్తూరికా భిక్షాదానం బిడరా" - అని తల బిరుసుగా రాజును అడిగిన వాడే, జీవిత చరమాంకంలో పరిస్థితులకు తలవంచుతాడు. ఆకలికి అంగలారుస్తాడు. పలనాటిలో జొన్నకూడు అరగిస్తాడు. చేతిలో చిల్లిగవ్వ లేక చింతిస్తాడు. భూమి శిస్తు బకాయి నేరానికి పురవీధిలో మెడమీద గుదిబండ మోసే శిక్షను భవిస్తాడు.

తన కవితా సార్వభౌమత్వాన్ని ఈ లోకంలోనే కాదు అమరపురిలో కూడా నిలుపుకో గలనన్న ఆత్మ విశ్వాసం కల వాడు శ్రీనాథుడు. చనిపోతూ "దివిజ కవివరుగుండె యల్ దిగ్గురననరుగు చున్నారు

కొరవ 11 వ పేజీలో)

# నిరోషా ఆవేదన

రాధిక చెల్లెలు నిరోషా ఒకప్పుడు బిజీ స్టార్. నేడు ఆమెకు ఒక్క చిత్రమైనా లేదు. ఈ విషయమై ఆమె చెప్తూ "మా బంగళా ముందు సదా నిర్మాతల కార్లు ఉండేవి. ఎలాగైనా దయచేసి వెంటనే కాల్‌షీట్లు సర్దండి. పారితోషికం ఎంత అడిగినా ఇస్తాం అంటూ నిర్మాతలు ఎంతగానో బతిమాలేవారు. అన్ని చిత్రాలూ ఒప్పుకోవడానికి ఎలా వీలవుతుంది? ఇప్పుడు చూడండి నా పరిస్థితి. రెండు మూడు సిన్మాలు ఫెయిల్ అవడంతో నన్ను అచ్చిరాని తార కింద జమ కట్టేశారు. ఆ సిన్మాలు ఫెయిల్ అవడానికి కథో, కథనమో, సంగీతమో, దర్శకత్వమో కూడా కారణాలు అయి ఉండొచ్చుగా? కాని, నా వల్లే ఫ్లాప్ అయిందన్నట్లు భావిస్తే ఎలా? ఆ చిత్రాలలో నా పక్కన నటించిన హీరోలను రాశి లేని వారు అనరేం? వాళ్లు బిజీగానే ఉన్నారు కదా? నాకూ మంచి కాలం వస్తుంది. మళ్లీ బిజీ తార అయితీరుతాను" అంది. చూద్దాం!

## బాపూ రమణల "పెళ్లి కొడుకు"

బాపు దర్శకత్వంలో తొలిసారిగా నరేష్, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం బాబూ మోహన్ నటించే "పెళ్లికొడుకు" నవంబర్‌లో మొదలవుతుంది. ఎ.వి.ఎస్. (తుత్తి), దివ్యవాణి, సంగీత ఇతర పాత్రధారులు.



'స్వర్గయానము' పుస్తక ప్రతిని కృతిభర్త సి.సి. సుబ్బరాయులు శెట్టికి అందిస్తున్న జస్టిస్ దశరథరామి రెడ్డి. డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి. కృతి కర్త దేవరపల్లి నాగయ్య కూడా చిత్రంలో వున్నారు.

## పొట్టి శ్రీరాములు

4 పేజీ కొరవ

[illegible] జనే సందేహం రాయలసీమ మిత్రులకు వుండేది. శ్రీబాగ్ ఒడంబడిక ద్వారా ఒక అంగీకారాన్ని కుదుర్చుకొని ఆ సందేహాన్ని నివృత్తి చేసుకున్నారు. అయినా ఏవేవో అభ్యంతరాలు ఆటంకాలు కనిపించినవీ, కనుపించనివీ ఉంటూనే వచ్చాయి. ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించటం ఎట్లా? అనే సందిగ్ధంలో పడ్డారు. స్వరాజ్యం వచ్చిన పిదప మహాత్ముడు ఆమరణ నిరాహార దీక్షను కొనసాగించి దేశంలో శాంతిని నెలకొల్పారు. అది తెలుగు నాయకులలో కొంత మందికి స్ఫూర్తి నిచ్చింది. వేరే కాపురానికి ఆమరణ నిరాహార దీక్ష శరణ్యమని వారికి తోచింది. అయితే దానికి ఎవరు పూనుకోవాలి? మహాత్ముని లోని దృఢ సంకల్పం - చిత్తశుద్ధి ఎవరి కున్నాయి? అందుకు శ్రీ పొట్టి శ్రీరాములు గారు ముందుకు వచ్చారు. ఆమరణ నిరాహార దీక్ష మాత్రమే శరణ్యమనుకున్న వారిలో చాలా మంది ప్రసిద్ధులున్నారు. రాష్ట్ర నాయకులూ ఉన్నారు. అధికారాన్ని చవి చూచిన వారూ వున్నారు. అయినా వారెవరూ అందుకు పూనుకోలేదు. అప్పటికి అజ్ఞాతంగా వున్న పొట్టి శ్రీరాములు గారే ఆ మహా కార్యానికి ఆయత్తమైనారు. ఆయనలోని చిత్తశుద్ధి అటువంటిది.

అప్పటి వరకూ ఆయన గాంధీజీ ప్రవచించిన నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నమై ఉన్నారు. స్వాతంత్ర్య పోరాటంలో జైలుకు వెళ్లారు. సబర్మతీ ఆశ్రమంలో మహాత్మునికి అంతే వాసులుగా వున్నారు. ఆ ఆశ్రమ కులపతి, జాతి కులపతి అయిన గాంధీజీ ఒరవడిని అలవరచు కున్నారు. అరమరికలు లేని గాంధే యుడైనాడు. అందువల్లనే పేరు మోసిన నాయకులు సైతం చెయ్యని మహా యజ్ఞానికి తలపడ్డారు. కనుకనే శ్రీరాములు గారు గాంధీజీ వారసులయ్యాడు. చాలా మంది గాంధీజీకి కేవలం అనుచరులు మాత్రమే. కాని శ్రీరాములు గారిలో గాంధీజీలోని సత్యనిష్ఠ, సంకల్ప బలం, చిత్తశుద్ధి మూర్తి భవించాయి.

ప్రాణం పోతున్నప్పుడు కూడా సందేహింపలేదు. ఎవరు ఆపమన్నా ఆగలేదు. "మూర్ఖంగా ఆత్మహత్య చేసుకుంటున్నా వని" కొంత మంది విమర్శించినా సంకల్పం సడల లేదు. దాదాపు అజ్ఞాతుడుగా దీక్షను ఆరంభించిన పొట్టి శ్రీరాములు ఆత్మబలి దానంతో అమరులైనారు. ఆంధ్రులకు ఆరాధ్యులైనారు. భాషా ప్రయుక్త రాష్ట్రాలకు ఆద్యులైనారు. ఆనాటి నాయకులలో కొంత మంది తెరమరుగైనారు కానీ చరిత్రను సృష్టించి శ్రీరాములు గారు చరితార్థులైనారు.

శ్రీరాములు గారు రాజకీయ వాది కారు. అప్పటికి లోక ప్రసిద్ధుడూ కాదు. అయినా శ్రీరాములు గారు నెరపిన ఆత్మాహుతి తెలుగు వారిని తీవ్రంగా కదిలించింది. ఉవ్వెత్తున ప్రజా ఉద్యమం చెలరేగింది. ప్రజల్ని ప్రభావితుల్ని చేశారు. వారిని కార్యోన్ముఖులుగా చేశారు. స్వచ్ఛమైన ఆయన వ్యక్తిత్వం దానికి కారణం. తోటి మనుషుల్ని ప్రేమించే ఆయన స్వభావమే దానికి కారణం. తనకు ఏ అధికారమూ - ఆధిక్యమూ కోరుకోక పోవటమే కారణం. తాను నమ్మిందే చెప్పారు, చెప్పిందే చేశారు. అందువల్లనే ప్రజలు ఆయన్ను ఆదర్శంగా తీసుకున్నారు. రాజకీయ వ్యవహారాలకు అతీతంగా వుండే ప్రజావాణి ఈనాటి మన పురోభివృద్ధికి అవసరం. ఇందుకు వేగు చుక్కలా మనకు శ్రీరాములు గారు దిక్కు చూపుతూ వుంటారు.

ప్రజాస్వామ్య వాది యైన నెహ్రూ ప్రజాభిప్రాయాన్ని మన్నింపక తప్పలేదు. తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రాన్ని ప్రకటించారు. ఆంధ్ర రాష్ట్ర అవతరణంతో దేశమంతటా భాషా ప్రాతిపదిక పై రాష్ట్ర విభజనలు జరిగాయి. అవి ఆయా ప్రాంత ప్రజల అభిమానాన్ని బట్టి జరిగినా వాటికి తెలుగు ప్రజలు మార్గదర్శకులైనారు. అందుకు నాంది వచనం పలికింది శ్రీశ్రీరాములు గారు.

బాధ్యత గల ప్రజావాణిని పెంచి శక్తివంతం చేయటం ఈనాటి ముఖ్య అవసరాలలో ఒకటి. శ్రీరాములు గారు చూపెట్టిన మార్గంలో మనం పయనించ వలసి వుంది. చిత్తశుద్ధిని, నిస్వార్థ సేవానిరతిని ఆయన నుండి నేర్చు కోవలసి వుంది.

పొట్టి శ్రీరాములు గారు మానవ ప్రయత్నానికి ఒక ధ్రువతార వంటి వారు. మహాత్యాగి, మహోజ్వల తపోధనుడు. మహనీయ శక్తి సంపన్నుడు, సత్యవాది, శాంతి ప్రియుడు, గాంధీజీ కుటుంబీకుడు, ప్రతిభాశాలి, దీక్షా సంపన్నుడు, నిస్వార్థ వ్యక్తి, ధీర తపస్సంపన్నుడు, కర్మయోగి, మానవ సేవయే - మాధవ సేవ - దేశ సేవ దేవుని సేవ అని భావించిన వాడు.

ఆంధ్ర రాష్ట్రం సంపాదించటమే వారి ధ్యేయం. ఆంధ్ర రాష్ట్ర ప్రజల సంక్షేమమే వారి సంక్షేమం. అందుకు తన ప్రాణాలు పోతాయని తనకు తెలుసు. తన ప్రాణాలు కాపాడు కోవడం తన చేతుల్లోనే వున్నా అందుకు ఎన్నడూ ప్రయత్నించ లేదు. అందుకనే తనను పరీక్షించుటకై వచ్చి సత్యాగ్రహం మానండి అని సలహా ఇచ్చిన డాక్టర్ల బృందానికి "నేను స్పృహలేని స్థితిలో ఉన్నప్పుడు నాపై మీకు వున్న భక్తి గౌరవాల కొద్దీ నన్ను బ్రతికించ డానికి ప్రయత్నిస్తారేమో? ఆ పని మాత్రం దయచేసి చెయ్యవద్దు నన్ను ప్రశాంతంగా సత్యాగ్రహం చేయనియ్యండి" అని బ్రతిమాలు కున్నారు. తాను నమ్మిన సిద్ధాంతాల కోసం తానే పూర్ణాహుతి అయిపోయారు.

## రాజరాజేశ్వరి

(4 పేజి కొరవ)

దృశ్యాన్ని కదిలే బొమ్మలతో ఏర్పాటు చేయడంతో రోడ్డున పోయే ప్రతివాడి కళ్లు దాని వైపుకు టక్కున ఆకర్షింప బడ్డాయి. కార్లు, బస్సులతో సహా నిలిపి మరీ చూశారు.

తిరునాళ్ల జనం చూస్తే జిల్లాలోని దేముళ్లందరి లోకి రాజేశ్వరమ్మే జనాకర్షణలో ఫస్ట్ ప్రైజు కొట్టేస్తున్నదా అన్పించింది. జనంలో సహజంగానే శక్తి దేవతల పైన మోజు పెరుగుతున్నది. సాయిబాబా, అయ్యప్ప, రాజేశ్వరి వంటి శక్తి దేముళ్లను కొలిస్తే వారి కున్నవిగా ప్రచారంలో వున్న మహిమల వల్ల, ఆస్తులు వుండీ పాపమా దేముళ్లు పేదరికంతో క్రుంగి పోతున్నారు.

ఈ పరిణామ క్రమంలో రాజేశ్వరమ్మ జనాకర్షణలో అందరినీ అధిగమించి పోతున్నది. రాఘవ రెడ్డి వంటి కష్ట జీవి పాలనలో తొమ్మిదేళ్లు వుండడంతో దేవాలయం అభివృద్ధి కూడా అచ్చెరువు గొల్పే తీరులో వుంటున్నది. వీధి ప్రక్క సాదా గుడిగా వుండిన రాజేశ్వరమ్మను జిల్లాలో ఫస్టున నిల్పిన ఘనత రాఘవ రెడ్డిదే. ఆమె ఆదాయం కూడా అప్పుడు ఏడాదికి రమారమి ఏడు లక్షలు. ఈ తొమ్మిదేళ్లలో దాదాపు 20 లక్షల రూపాయల విలువైన నిర్మాణాలు జరిగాయి. కళ్యాణ మండపం ఏర్పడింది; గుడి గోడలన్నీ గ్రానైట్ రాళ్లతో తళతళ లాడుతున్నాయి. ప్రక్కన విశాలమైన డైనింగ్ హాలు నిర్మాణంలో వుంది. ఎయిర్ కూల్డ్ గాలి భక్తులను గుడి లోపల చల్ల బరుస్తున్నది. నవగ్రహ మండపం, అలంకార మండపం, నాగదేవత గుడి ఏర్పడ్డాయి. గాయత్రి దేవాలయం నిర్మాణంలో వుంది. మరొక రెండేళ్లు రాఘవ రెడ్డి అధ్యక్షుడుగా కొనసాగితే దేవాలయం పరిపూర్ణ రూపం సంతరించు కోవడం ఖాయం. రాజేశ్వరమ్మ తన సేవకుడ్ని ఇంత త్వరగా వదలుకోదనే భావించాలి.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### సూళ్లూరుపేట డాక్టరు

మన్నారు పోలూరులో గత 25 తేది జరిగిన వ్యక్తుల కొట్లాటలో పల్లూరు రామయ్యకు ముక్కు మీద దెబ్బ, రుధిర ప్రవాహం, శ్వాసగూడ ఆడని స్థితి. ఈ పరిస్థితిలో నదీ ప్రవాహం దాటుకొని రాత్రి 11 గంటలకు ఆసుపత్రి చేరి డాక్టరును ఎంత పిలిచినా రాలేదు. చతుర్ముఖ వేద పారాయణం ఆయన విధ్యుక్తాన్ని విస్మరింప జేసింది. ఎంత ప్రమాదమని మొత్తుకున్నా కదలలేదు. గత్యంతరం లేక ఆ రోగిని తిరుగా ఆ అర్థరాత్రిలో మన్నారు పోలూరు వేసుక పోయినారు.

అవేనండి! ప్రజా సౌకర్యార్థం పెట్టిన ఆసుపత్రులు? వీరేనండి! ప్రాణాన్ని రక్షించే వైద్యాచార్యులు? ఇట్టి డాక్టర్ల విషయం లో పై యధికార్లు చర్య పుచ్చుకోవడం అవసరం గదా?

- ఒ.వి.

## నెల్లూరు ముచ్చట్లు

### కొట్టెర కఱవు

గీ. మనుమసిద్ధి వెనుక, మనతిక్కనకు వెనుక
హరిహరాది లేప, వరుల వెనుక
వంట సరకు కరవు, తంటయేయెరుగము
విశ్వదాభిరామ, వినరవేమ

ధాతుకర వచ్చినపుడు, డొక్కల కరవప్పుడు, తిండికి బాధ పడ్డారు కాని పోయిలోకి కట్టెల కెప్పుడు నెల్లూరు పుట్టిన తర్వాత యింత పెద్ద విపత్తు వచ్చి ఎరుగదు.

- విమర్శకుడు

## ముఖ్యమంత్రి

(మొదటి పేజి కొరవ)

చేతనే ఇక్కడ ఏదో కొంప మునిగి పోయినట్లు తెలుగుదేశం వాళ్లు గొడవ చేయడం మర్యాద కాదు. అయినా వాళ్ల విమర్శల్ని నేను పట్టించుకోను అని ముఖ్యమంత్రి తెల్పారు.

ఉత్తరప్రదేశ్‌లో జరుగుతున్న అసెంబ్లీ ఎన్నికల పరిశీలకుడుగా ముఖ్యమంత్రి నియమితులైన విషయం తెలిసిందే. అక్కడి అభ్యర్థులకు పార్టీ టిక్కెట్లు కేటాయించి ఆయన తిరిగి వచ్చారు. ఉత్తరప్రదేశ్‌లో మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటయ్యే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని, అక్కడ ఏ పార్టీకి కూడా నిర్దిష్టమైన మెజారిటీ వచ్చే సూచనలు లేవని ఆయన తన సన్నిహితులతో చెబుతున్నారు. బయటకు మాత్రం కాంగ్రెస్ పార్టీకి విజయావకాశాలు మెరుగయ్యాయని అంటున్నారు.

## జనవాణి

(3 పేజి కొరవ)

ఇదేవిధంగా ఇష్టీ మొదలు ప్రతి బటయికు తీవ్రమైన దెబ్బ వసూలు చేస్తున్నారు. వీళ్లను నియంత్రించే అధికారే కరువయ్యారు. సరసమైన ధరలను అటుంచితే శుభ్రత కూడా కరువయ్యింది. ఈ పద్ధతులను సరిదిద్దే వారే లేరా?

నెల్లూరు -ఎం.రావు

### ట్రాఫిక్ నిబంధనలు అమలు పరచవద్దు!

పద్ధతుల్ని ఎస్.పి గారు ట్రాఫిక్ గందరగోళం చేసేస్తున్నారు. సమస్యను సవిరంగా అధ్యయనం చేసివుంటే ఈ విధంగా చేసి వుండేవారు కాదు. ఎమ్మెల్యే శ్రీ ఆనం రెడ్డి సూచించిన విధంగా మినీబైపాస్ రోడ్డు నిర్మితమయ్యాక కొత్త నిబంధనలు పరిశీలిస్తే బాగుండేది. మినీబైపాస్ వల్ల నెల్లూరు రోడ్ల స్వరూపమే మారిపోతుంది. ఆత్మకూరు బస్టాండ్, రామలింగాపురం అండర్ బ్రిడ్జిల సమస్యతోపాటు విజయ మహల్ గేటు వద్ద రద్దీ కూడా తప్పక తగ్గుతుంది. పనిలో ట్రాఫిక్ విధానంలోనూ మార్పు వస్తుంది. కారణం బైపాస్ రోడ్డులో భారీ వాహనాలు ఇతరాలు వెళ్లడమే. అందువల్ల సామ్యులైన ఎస్.పి. గారు ఈ సూచనలను సహృదయంతో పరికించి మినీబైపాస్ పూర్తయ్యే వరకు పాత ట్రాఫిక్ విధానమే అమలు పరచమని మనవి.

నెల్లూరు - వాస్తు రామచంద్ర

### అధ్వాన్నంగా ఆత్మకూరు బస్టాండ్

నెల్లూరు టౌన్‌లో రద్దీగా వుండే బస్టాండులలో ఆత్మకూరు బస్టాండ్ ఒకటి. నిత్యం వేలాది మంది ప్రయాణీకులు ఇక్కడ నుండి రాకపోకలు సాగిస్తుంటారు. ఇంతటి ప్రాముఖ్యమైన బస్టాండ్‌లో కనీస సౌకర్యాలు కరువయ్యాయి. రోడ్డు లెవల్ కన్నా బస్టాండు తక్కువ ఎత్తుగా వుండడం వల్ల వర్షం పడితేచాలు మడుగులా మారుతున్నది. బస్టాండ్ సౌందర్యం చూడాలంటే నాలుగు చినుకులు రాలినప్పుడే చూడాలి. అడుగు తీసి అడుగు వేయలేము. ఎండలకూ నిలువ నీడలేదు. తగిన ప్రదేశంలో లేని షెల్టర్ ఆక్రమణల పాలై వుంది. మంచి నీటి సౌకర్యం కూడా లేదు. పూలకొట్లు, హోటళ్ల, పుణ్యంగా వచ్చిన చెత్తకు, రైల్వేలైను పక్క వెళ్లేడైన్ నీరుతోడై దుర్గంధాన్ని ప్రజలకు పంచుతుంది. బస్టాండ్‌ను అభివృద్ధి చేసే విషయంలో ఆర్టీసీ - మునిసిపాలిటీ ఒక అవగాహనకు వస్తే వేలాది ప్రయాణీకులు హర్షిస్తారు.

నెల్లూరు -కె.ఎల్. రవి

భావభరిత, చమత్కార శోభిత కవితా తోరణం!

# భారతి నా అమ్మణ్ణి!

ఈ కృతి 27 కవితల సంపుటి. పుస్తకం పేరులోనే కవికిగల దేశ భక్తి వ్యక్తమవుతూ వుంది. భారత దేశాన్ని దేవతగా, మాతగా భావించి అనేక సన్నివేశాలలో, సందర్భాలలో నేడు జరుగుతున్న రాజకీయ పరిణామాలకు స్పందించిన కవి రచించిన కవితా సంపుటి ఇది. నామ సామ్యాన్ని బట్టి సినీ కవి ఆత్రేయ అని రచయితను భ్రమింప వచ్చు. చిత్ర కవితలు, గర్భ కవితలు అంతరించిన యీ రోజుల్లో చిత్ర కవి అనే యింటి పేరుతో యీ కృతిని వచన గేయాలతో, మాండలిక భాషా కవితలతో, సున్నితమైన భావాలతో వ్రాశారు యీ గ్రంథాన్ని.

''భారతి నా అమ్మణ్ణీ
నేను భారతీయుణ్ణీ
బెలాను ఆదర్శ పౌరుణ్ణీ
సేవిస్తాను నా పౌరుగువాణ్ణీ

అని తన భారతీయతను, సేవా భావాన్ని వెల్లడిస్తూ కృతి ప్రారంభించారు.

కవిత్వం చెప్పండి అనే కవితలో-

చిమ్మ చీకటిలో చిరు వెలుగు కవిత్వం
కాంతి రేఖను కాదు చీకటిలో
కలివేది కనిత్వం
సామాన్యుణ్ణి మాన్యుణ్ణి చేసే
గేయం కవిత్వం
మందూ మాకులకు లొంగని
గాయం కనిత్వం.

అని కవిత్వ, కనిత్వాల అంతర్యాన్ని తేట తెలుగు పదాలలో వెల్లడించారు.

పూవు - తుమ్మెద అను కవితలో

> **గ్రంథ సమీక్ష**
>
> **భారతి నా అమ్మణ్ణి**
>
> రచయిత
> చిత్రకవి అత్రేయ
>
> సమీక్షకుడు
> సురభి నరసింహం
>
> ప్రతులకు
> సహృదయ సాహితి
> ఎ2, షీలానగర్
> విశాఖపట్నం - 530 012.
>
> వెల
> రూ. 15/-

మనిషి మస్తకానికీ, మంచి పుస్తకానికీ
పూవుకు తుమ్మెదకు ఉన్నంత
సన్నిహితం
ఆత్మకు, పరమాత్మకు, ఉన్నంత
సన్నిహితం

పుస్తక ప్రాశస్త్యాన్ని తెలిపారు!

మా బాపూ కవితలో

దరిద్రులలో నారాయణుని
సేవిస్తున్నావు నీవు
కరవు కాటకాలలో వరదలను
సేవిస్తున్నాము మేము

అని గాంధీకి, నేటి నాయకుల కున్న అంతరాన్ని విశ్లేషించారు.

పాప పోలికలు అనే కవితలో

శిశువుల మోములు
నలినీ దళములు
పాపల స్వనములు
సప్తస్వరములు
బాలల హృదయము
దేవి ఆలయము
పాపల హాస్యము
పార్వతి లాస్యము

అని లలిత పదాలతో పసిపాపల పోలికలు వర్ణించారు. జవహర్ లాల్ నెహ్రూను గూర్చి వ్రాస్తూ

ఉన్నతవంశాన బుట్టి
మిన్నగ సుఖముల దేలక
కన్నతల్లి దాస్యశృంఖలాల
దునుమాడగ
అహరహమూ అహమికతో
కష్టాలకు తలవొగ్గిన, తుదనెగ్గిన
తొలి ప్రధాని మన జవహర్

అని జాతి నాయకుని ఔన్నత్యాన్ని చిత్రించారు.

కవిత - సవిత అనే గేయంలో

నా కవిత నవ్యాతి నవ్యం
భవ్యాతి భవ్యం, అత్యంత శ్రావ్యం
నిత్య సంసేవ్యం, సత్యసంభావ్యం

అని తన కవితా ధ్యేయాన్ని తెలుపుకొన్నారు. ఆరుద్ర గారి కూనలమ్మ పదాలను అనుకరిస్తూ, సహృదయ పదాలు రచించారు.

పనికి జంకే వాడు, ఎవుడుబొంకువాడు
నీకు మిత్రుడు కాడు, సహృదయమిత్రా

అని చమత్కరించారు.

చివరగా మంగళా శాసనంలో

మోమాటం, బిడియం,
నిర్లిప్తత, నిస్తబ్ధత
మనలో కొందరికి భూషణాలు
సుతిమెత్తని మా హృద్వారాల
తోరణాలు

ప్రతి వ్యవస్థలో అవస్థలో
ప్రతివ్యక్తిలో, శక్తిలో
దేశభక్తిలో సైతం
రాజకీయ, స్వకీయ ప్రయోజనాలు
నాటకీయంగా సాధించ బడుతున్నాయి
ప్రజా శాసనాలు, దుశ్శాసనుల
పాలబడుతున్నాయి

అని నేటి రాజకీయ పరిణామాన్ని గుండెకు హత్తుకునేలా వ్రాశారు.

ఈ కృతిలో కవితలన్నీ భావ భరితాలే! చమత్కార శోభితాలే! లోకానుభవంతో వ్రాసినవే. నేటి సామాజిక, రాజకీయ పరిస్థితులను వ్యంగ్యంగా, ఛలోక్తిగా చమత్కరించినవే! లలిత పదాలతో, రమ్య భావాలతో, చక్కని ఆశయాలతో, ఆలోచనతో వ్రాసిన యీ కవితలన్నీ సహృదయసంభావ్యములే! ప్రతి పేజీలో భారతమాత చిత్రాన్ని ప్రచురించడం, దర్శింప చేయడం కవి యొక్క దేశ భక్తిని తెలియ చేస్తుంది. కవికి హృదయ స్పందన కలిగినప్పుడే, లోకాన్ని దర్శించినప్పుడే, అనుభూతి కలిగినప్పుడే మంచి కవితలు ఉద్భవిస్తాయి. ఈ మాటకు యీ కృతి ఒక ఆకృతి. భారతి నా అమ్మణ్ణీ అను కృతి చదివిస్తుంది ప్రతి భారతీయ పౌరుణ్ణి. రచయితకు అభినందనలు. కొన్ని కవితలు సుదీర్ఘంగా వున్నవి సంక్షిప్తం చేసి వుంటే బాగుండేది.



శారదా సాహితీ సంస్థ ప్రకటించిన బెస్ట్ స్కూల్ అవార్డును అందుకొంటున్న మాడరన్ స్కూల్ కరస్పాండెంట్ వి. విజయకుమార్ రెడ్డి, అందజేస్తున్న రచయిత అంబడిపూడి, సంస్థ వ్యవస్థాపకులు బి. సీతారామశాస్త్రిలను చూడవచ్చు.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

శ్రీనాథుడమరపురికి'' అని ధీరతతో చాటువును చాటుకున్నాడు. ఇంతటి మహిమాన్వితుడైన ఒక ప్రౌఢ కవిలోని నిక్షిప్త శక్తుల విశిష్టతను యిలా క్లుప్తంగా వినటం కంటే బాపు దర్శకత్వంలో రూపొందించిన ''శ్రీనాథ కవి సార్వభౌముడు'' చిత్రం చూచి విపులంగా తెలుసు కోవడం మంచిది.

శ్రీనాథుని సమగ్ర జీవితానికి అద్దం పట్టాడు బాపు. చిత్రంలో ఎక్కువ భాగం శ్రీనాథుని శృంగార విన్యాసాలు చూపబడ్డాయి. ఆయన కొండవీటి నుంచి కర్ణాటక రాజ్యానికి సాగించిన ప్రయాణంలో అడుగడుగునా కనిపించిన అందమైన ఆడ వారి అంగాంగాలను పద్య రూపంలో పచ్చిగా వర్ణించాడు. రోడ్డు ప్రక్కన రోమియోలా కనిపించాడు. ఆనాడున్న రాజుల రుచి, అభిరుచి సాంఘిక వ్యవస్థను బట్టి విశృంఖలమైన చిత్తవృత్తితో శ్రీనాథుడు శృంగారాన్ని విరివిగా ఒలకబోశాడు. ఈ శృంగార వర్ణన ఈనాటి సమాజానికి అసభ్యంగా తోస్తుంది. శ్రీనాథుడు శృంగార కవి అని చెప్పేందుకు ఒకటో రెండో పద్యాలు వర్ణించి వుండటం సభ్యతగా వుండేది. సందు చిక్కిందని వ్యాపార పరంగా అదే పనిగా వరస బెట్టి స్త్రీల అంగాలను పేరు పేరున వర్ణించే సన్నివేశాలు చూపటం చాలా తప్పు.

శ్రీనాథుడు రచించిన ''శృంగార నైషధం'' లో నలుడు దయమంతిని దర్శించిన దృశ్యం ప్రత్యేకించి చూపారు. ఇందులో నలుడుగా రాజేంద్ర ప్రసాద్, దమయంతిగా ఆమని పాల్గొంటారు. ఈ దృశ్యం శ్రీనాథుని కవితా మాధుర్యాన్ని అవమాన పరిచేదిగా వుంది. ''నునుబల్కుల తేనె లొల్కుచు'' దమయంతి నలుని పల్కరించి నట్లు శ్రీనాథుడు వర్ణించాడు. కాని ఈ దృశ్యంలో, దమయంతి కాకి గోల చేస్తుంది. చెంగు చెంగున ఎగురుతుంది. అదే విధంగా ''మధురాక్షరంబులు నీ మహిత భాషణంబులు'' అని దమయంతి నలుని ప్రశంసిస్తుంది. నలుని మాటల పొంకాన్ని, సొగసును శ్రీనాథుడు ఆ విధంగా వర్ణిస్తాడు. కాని ఇందులోని నలుడు రాజేంద్ర ప్రసాద్ కదా, తన మామూలు సాంఘిక హాస్య ధోరణిలో వికారంగా మాట్లాడుతాడు.

శ్రీనాథుని జీవితం పల్నానికి దిగజారి నప్పటి నుంచి చిత్రం బిగువుగా సాగుతుంది. శిస్తు చెల్లించని నేరానికి శిక్ష ననుభవించే దృశ్యం, జీవితాన్ని చాలించి అమరపురికేగిన దృశ్యం బాగున్నాయి. ఈ దృశ్యాల్లో రామారావు జీవించాడు.

విద్యానగర వీధుల్లో గౌడ డిండిమ భట్టు శ్రీనాథుల వ్యతిరేక ఊరేగింపులు, వస్తాదుల గదా యుద్ధాలు, ఇలా యింకా కొన్ని సన్నివేశాలు కలిసి అనవసరంగా చిత్రం నిడివిని మూడు గంటలకు పెంచి ప్రేక్షకుల ఓపికను పరీక్షించాయి.

కాని, ఈ చిత్రంలో వున్న సుమారు 46 పద్యాలు; శ్రీనాథుని పరిమళ బంధురమైన పద్యాలు ప్రేక్షకుల ఓపికకు వీపు తట్టి చిత్రం చివర వరకు కూర్చోబెట్టాయి. ఆ పద్యాల్లోని అంద చందాలు తియ్యదనాన్ని, శృంగార మాధుర్యాన్ని అర్థ గాంభీర్యాన్ని, శబ్ద సౌందర్యాన్ని యస్పీ బాలసుబ్రహ్మణ్యం తన కమ్మని కంఠంతో రమణీయం చేశాడు. ఆయన పాడిన ప్రతి పద్యం చిత్రానికి ఒక జీవకళగా నిలిచింది. ప్రేక్షకులకు వీనుల విందు చేసింది. రససిద్ధిని, గాన మాధుర్యాన్ని సంతరించుకున్న పద్యాలను వింటూ మూడు గంటల కాలాన్ని ఒక మధుర క్షణంగా మలుచుకోవచ్చు.

ముళ్లపూడి వెంకట రమణ మాటలు కొన్ని పాత్రలకు గుంభనంగా అమరాయి. ఫోటోగ్రఫీ చివరి దృశ్యాల్లో చీకటి వెలుగులను కళాత్మకంగా చూపింది.

సత్యనారాయణ డిండిమ భట్టుగా గర్వం బాగా ప్రదర్శించాడు. శ్రీనాథుని భార్యగా జయసుధకు పెద్ద అవకాశం లేదు. చివరన మౌనంగా మరణించి శ్రీనాథుని ఒడిలో ఒరిగినప్పుడు ఆమె నటన పరాకాష్టకు చేరింది. మిగతావన్నీ చిన్న చిన్న పాత్రలు. రాళ్లపల్లి నాగు పాములా నాలుక బైటకు నెట్టూ మంచి హాస్యం సృష్టించాడు.

యన్టీఆర్ బాన బొజ్జను మరుగు పరచిన దర్శకునికి జేజేలు.

**సినిమా**

(2 పేజి కొరవ)

తిరుడా'' చిత్రంలో సి.బి.ఐ. చీఫ్‌గా నటించడానికి కారణం అది నా చిరకాల వాంఛ. నిజంగా మణిరత్నం చాలా గొప్ప దర్శకుడు. షూటింగ్‌లో ఏ టెన్షనూ ఉండదు. ఆయనకు ఏ ఎఫెక్ట్ కావాలో, దాన్ని ఆర్టిస్ట్ నుంచి ఎలా రాబట్టాలో బాగా తెలుసు. అందుకే ఆ చిత్రం క్లయిమాక్స్ కోసం నేను ఏడు వారాలు కేటాయించేసరికి నా తలప్రాణం తోకకు వచ్చినంత పనైందంటే నమ్మండి'' అన్నారు. ఈ చిత్రం తెలుగులో ''దొంగ- దొంగ'' గా డబ్ చేయబడుతోంది. సంగీతం: రెహమాన్, ఛాయ: పి.సి. శ్రీరామ్, చిత్రకథను మణిరత్నంతో రాంగోపాల్ వర్మ కలిసి రూపొందించారు.

## శ్రద్ధాంజలి

మా తల్లి

# బద్దెవోలు రుక్మిణమ్మ గారు



(స్వర్గీయ బద్దెవోలు మస్తాన్ రెడ్డి గారి సతీమణి, వీరంపల్లి)

23.10.93 తేది అకస్మాత్తుగా హృదయచలన మాగి తనువు చాలించిరి.

ఆమె ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## ఉత్తరక్రియలు

2.11.93 తేది మంగళ వారం - శిలాప్రతిష్ట

3.11.93 తేది బుధవారం - బ్రాహ్మణ బియ్యాలు

వీరంపల్లిలో మా స్వగృహమున జరుగును.

బంధుమిత్రులు తెలియ గోరుతాము

కుమారులు - కోడళ్లు: నారాయణ రెడ్డి, Advocate - డా. అహల్యా రెడ్డి
శ్రీహరి రెడ్డి M.Sc., (Ag) - డా. కృష్ణవేణి; మాధవ రెడ్డి - సౌజన్య

కుమార్తెలు - అల్లుళ్లు: పార్లపల్లి సునీత - చంద్రశేఖర రెడ్డి
చెన్నూరు విజయలక్ష్మి - మనోహర రెడ్డి

మనుమలు - మనుమరాండ్రు: వంశి, శశి, హరి, శ్రీకాంత్, హర్షవర్ధన్, సునీల్
హరిత, మమత, సుధ, మాధవి, అమూల్య, మాధురి.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,